(స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుచున్న హిందీ పండితులు)



పేరు : సిస్టర్ వై. స్టెల్లా

వృత్తి : హిందీపండిట్

అర్హతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్

కేంద్రం : సెయింట్స్ జోసప్స్ గరల్స్ హైస్కూలు.

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్షనందు కృషి

చిరునామా : సెయింట్ జోసప్స్ గరల్స్ హైస్కూలు,
నంద్యాల (పోష్టు) కర్నూలు జిల్లా



పేరు : డి. లింగేశ్వరరావు

వృత్తి : హిందీ పండిట్

అర్హతలు : ప్రవీణ, ప్రచారక్, సా. రత్న

కార్యక్షేత్రం : జయభారత హిందీ విద్యాలయం, గుంటూ

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష యందు కృ

చిరునామా : జయభారత్ హిందీ విద్యాలయం,
ఆర్. అగ్రహారం, గుంటూరు-3



పేరు : జి. దొరస్వామి నాయుడు

వృత్తి : హిందీ పండితులు

అర్హతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, పి. యు సి.

కార్యక్షేత్రం : జి. ప. హైస్కూలు, ఎర్రచెరువు పల్లె

అభిరుచి : హిందీప్రచారం, పరిచయ పరీక్షయందు కృషి

చిరునామా : జి. ప. హైస్కూలు, ఎఱ్ఱచెరువు పల్లె (పో
చిత్తూరు జిల్లా

# స్రవంతి

సాహిత్య మాస పత్రిక

**364**


ఆగస్టు 1984 : : సంపుటి : 31, సంచిక

వార్షిక చందా : పదిహేను రూపాయిలు : : విడిప్రతి : రూపాయిన్నర



సంపాదకులు:

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

# ఈసంచికలో

# శ్రీ తంగిరాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారి నిర్యాణము



దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర శాఖకు తాత్కాలిక కార్యదర్శిగా పనిచేయుచున్న శ్రీ తంగిరాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు ది. 20-8-84 ఉదయం 7 గంటలకు విజయవాడలో మరణించినారు.

స్రవంతి పత్రిక తరపున వారి ఆత్మకు శాంతి చేకూర్చమని భగవంతుని ప్రార్థించుచున్నాము.

# 15 ఆగష్టు

— శేషం సుప్రసన్నాచార్యులు

భరత మాత దాస్యశృంఖలాలను త్రెంచుకొని బంధవిముక్తురాలై
కన్న బిడ్డలకుస్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదిస్తూ
ప్రణవనాదాన్ని పూరించినరోజు
కట్న కానుకలు, కులమతాలు విసర్జించి
ప్రేమకడలిలో తేలియాడుతూ జీవించమని
ప్రణయ నాదాన్ని పూరించినరోజు
కఠోరమైన కఠారముల కదలికలు లేక
శాంతి మంత్రి ప్రవచన ప్రహేళికలతో
స్వేచ్ఛా నాదాన్ని పూరిస్తూ స్వాతంత్ర్యం వచ్చిన రోజు
సౌశీల్యం హెచ్చిన రోజు
సౌహార్ద్రం మొలకెత్తినరోజు
స్తబ్దత స్తంభించిన రోజు
తెల్లవాడు నల్లవాడిని విడిచి వెళ్ళిన రోజు
స్వాతంత్ర్యానికి దీర్ఘము లేదు, దీర్ఘాయు వుంది.
చల్లని వెన్నెల పూర్ణీభవించిన
విశాల నేత్రములు గలది స్వాతంత్ర్యం
స్వాతంత్ర్యం ఆకాశం — స్వాతంత్ర్యం అవకాశం
ప్రేయసి సోయగాలు స్వాతంత్ర్యం
ప్రియుడి కవితా కుసుమాలు స్వాతంత్ర్యం
శ్రామికుడి చెమట చుక్క స్వాతంత్ర్యం
బిచ్చగాడి కడుపు స్వాతంత్ర్యం
దినురాలి మనసు స్వాతంత్ర్యం
15వ ఆగష్టుకు స్వాతంత్ర్యం.
అందుకే— 15 వ ఆగష్టుకు స్వాగతం

హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా.

# చెల్లీ

— మాధవరావు రేగులపాటి

చెల్లీ! నీ రూపు శీతాద్రి శిఖరాలను చేరినది.
చెల్లీ! నీ చూపు సముద్రపు లోతులను తాకినది
స్మృతి,
చీకటి వెలుగుల రెక్కలు తొడుగుకొని
భూతలమ్మును గగనమ్మును మార్గంగా
మలచుకొని
ప్రయాణము సాగించె
ఈ దిక్కులో విహరించె

ఒక తరుశాఖలో విరిసిన
సుమద్వయం
తల్లి కడుపులో పుట్టిన
మనమిరువురం.

అనవరతం అనుమాన సలిలం పారుతుంది
అవమాన గర్హిత గహనాటవి, గమనం సాగు
తుంది

అందుకే
ప్రతి హృదయంలో అనుమానం గుట్టలుగా
పెరుగుతుంది
ప్రతి మార్గంలో అవమానపు మట్టం ఎదుగు
తుంది.

ప్రేమ
ఆత్మ సమర్పణకు ఆకృతి
ఆత్మలో ఆత్మ కలయికకు ప్రతికృతి

చెల్లీ!
నీతో చెప్పుకున్న రాగం సాగుతుందేమోనని
చూస్తున్న
ఇన్నిరోజులు పదిమందికి చెప్పకుండా దానినే
దాస్తున్న.

అయిన
దోచుకున్న హృదయాన్ని చెప్పుతున్న
దాచుకున్న నా భావ పక్షం విప్పుతున్న
నన్ను చేరిన రాఖీ
నీకునాకు
ఎంతదూరమో ఎంతపూరమో
ఎన్ని గజముల దూరమో నేర్పింది!
పాలు త్రాగి తల్లి కడుపున విషగుళికలు
విసురుతున్న లోకం
సంక్రాంతిని చూచి ఎప్పుడైనా నవ్వు
తుందేమో విందాం
తర్కజాలమును తుఫాన్‌వలె విసురుతున్న
లోకం
వైవిధ్యం పెంచుతున్న హాలాహాల విషాదం
ఎప్పుడైనా సమసి పోతుందేమో చూస్తాం
రక్షా బంధనము చెప్పినట్టిదది సాధిస్తాం.

*    *    *

ఆడ, మగ రెంటికి మధ్యయందు
అడ్డుగోడ నిలుచుంది.
నీవు నాటిన ప్రేమ కల్పం వేళ్ళ
దన్ని దాన్ని కదుపుతుంది.

చెల్లీ!
కొంగ్రొత్తగా కొసకొసలో
కోమలంగా మిసిమిని చిమ్ముతున్న
పసిడి రంగు కోరకాలు పేర్చి
ప్రేమకు దేవాలయం కట్టాలని
మమతకు ప్రాణం పోయాలని
మానవతకు శ్రీకారము చుట్టాలని
సమతా ప్రతిష్ఠాపన జరపాలని
నాకుంది
నా ప్రతినకు రక్షగా ఉండాలని
నీకుంది,
నేడు వాతూలం పెడ విసురుతుంది
వేడిగాలి పెడబొబ్బలు పెడుతుంది
అవిచారము, అన్యాయము
అత్యాచారము, అహంకారము, అవినీతి
ఎన్ని ఎన్ని......?
మానవత్వం పొత్తిళ్ళలో దొర్లుతుంది
ఆమె తల్లి బొట్టు పెట్టి కుల్లగట్టి
అదుపులో పెట్టుతుంది
మానవతను అలుముకొన్న ప్రేత పిశాచాలను
దులిపి
ఉద్దండ ద్విపద, చమూసమూహాలను, సంస్క-
రించాలని ఉంది.

శాసనము — ప్రేమ
శాసకుడు — రాము
ప్రతికార్యం ప్రేమ మయం—అదిరామమయం
ప్రతికార్యం స్వార్థ భరితం—అది ప్రేతమయం
చెల్లీ!
ప్రేమ నేర్పి
ప్రతి హృదయంలో దీపాన్ని వెల్గిస్తానని
ప్రతి మనసులోన వెలుగులను ప్రసరిస్తానని
నాకున్నది.
నా ప్రతినకు రక్షగా ఉండాలని
నీకున్నది,
చెల్లీ!
ప్రతి హృదయంలో స్వర్గాన్ని దించాలని
ప్రతి హృదయంలో నందనమే పెంచాలని
నాకున్నది
నా ప్రతినకు రక్షగా ఉండాలని
నీకున్నది.
అదే ఈ రక్ష
ఇదే జగద్రక్ష.

ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల,
సుబేదారి-వరంగల్-506010

# సబకో సన్మతి దే భగవాన్

- తిరునగరి

ఈ దేశం ఇప్పుడు
సహస్రదళాలతో వికసించిన జలజంలా లేదు
కుక్కలు చింపుతున్న విస్తరిలా ఉంది
ఇక్కడి నరులు ఇతిహాసాల్లో వర్ణించిన సురల్లా లేరు
కల్లుతాగి పిచ్చెత్తి కలహిస్తోన్న రాక్షసుల్లా ఉన్నారు
నా దేశానికి రమ్మని
నా సౌందర్యాలు కళ్ళారా చూచి రమ్మని
దేశాల్లో మిత్రులకాహ్వానాలు పంపానిన్నాళ్ళు
డాల్ సరస్సుల్లాంటి నా ప్రజా హృదయాలు
హిమాలయ శృంగందాకా, నా వా [illegible] సిక క్షిగి సశాంతాలు
నా తాజ మహళ్ళు నా అజంతాలు నా ఎల్లోరాలు
నా పురా వైభవాలు నా ప్రస్తుత విజయాలు, నా ప్రగతి పథాలు
చూచి పొమ్మని
విశ్వానికి జాబులు వ్రాశాను
పాశ్చాత్య ప్రపంచం నన్ను చూచి
నా జనాన్ని చూచి
నా దేశాన్ని చూచి
వీడు భారతీయుడు గొప్పవాడని
ఈ ప్రజలు నిజంగా దేవతలని
ఈ దేశం భూతల స్వర్గమని కితాబులిచ్చింది
ఇప్పుడెవ్వరికీ ఏ జాబు వ్రాయదలచుకోలేదు
ఇంట్లో కులాసాగా లేదు
సిగ్గుతో తల వంచుకుంటున్నాను

మత ప్రమేయంలేని నా లౌకిక రాజ్యంలో
మత దురహంకారం మనుషుల్ని చంపేస్తోంది
ఆలయాల్లో దేవుళ్ళు ఉంటారన్న నమ్మకం వమ్మైంది
హంతకులకవి అటపట్టులయ్యాయి
ఏ కోదరుల్లా జీవించే నా జనులు
రాకాసి మూకల్లా పైశాచిక ద్వేషంతో

కత్తులతో పొడుచుకుంటూ
రైఫిళ్ళతో కాల్చుకుంటూ
ఆసిడ్ చల్లుకుంటూ
ఇళ్ళు తగలబెట్టుకుంటూ

ఇన్నాళ్ళ సంస్కృతికే నిప్పంటిస్తున్నారు
హింసాకేళితో వినోదిస్తున్నారు
ఎంతో సుందరంగా కన్పించే నా నేల
ఇప్పుడెంతో అసహ్యంగా జుగుప్సాకరంగా
శోకాకులంగా ఉంది!

ఎక్కడ చూచినా దుఃఖం భయం
ఏ క్షణంలో ఏమవుతుందోనన్న సందేహం
తుఫానులో ఉల్లోలంగా లేచి పడుతున్న కల్లోలినిలా
హాహాకారాలూ ఆర్తనాదాలూ విన్పించే యుద్ధ రంగంలా
ఈ దేశం నేడు క్లిష్ట పరిస్థితుల్లో ఉంది
పైకి మేమంతా మానవుల్లాగే ఉన్నాము
మనుషుల దుస్తులే వేసుకుంటున్నాము
మాలో దానవులెవ్వరో చెప్పడం కష్టంగా ఉంది
మతోన్మాదులూ దుష్టబుద్ధులూ గూండాలూ
స్వైర విహారం చేస్తున్న నా వర్తమానం

రక్త సిక్తమై పోతున్నది
దైత్యులు రెచ్చిపోతున్నారు
ఇంట్లో కులాసాగా లేదు

ఈ అరాచకాన్ని, హింసోన్మాదాన్ని చూచి
సిగ్గుతో తల వంచుకుంటున్నాను

ఓ ప్రభూ!

ఈ విపద్దశ నుంచి నా దేశాన్ని రక్షించు
మా వాళ్ళలో మానవతను వెల్గించు
ఈశ్వర్ అల్లా తేరేనామ్
సబకో సన్మతి దే భగవాన్!
సబకో సన్మతి దే భగవాన్!,

కవితా సదన్
పోచమ్మ వాడ
ఆలేరు
నల్లగొండ జిల్లా.

# స్వర్ణజయంతి పరిచయ పరీక్ష

ఆయిదవ పర్యాయం జరగనున్న స్వర్ణోత్సవ హింది పరిచయ పరీక్షా వివరములు——

1. పరీక్షా రుసుం, పరీక్షార్థుల వివరణ
పట్టిక పంపు చివరితేదీ 21.9 1984
2. పరిచయ పరీక్ష జరుగుతేదీ:- 21.10 1984

పరీక్షా రుసుం శ్రీ కార్యదర్శి, సర్ణోత్సవ కమిటి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర ఆద్రసుతో ది ఓ. 21.9.1984 వరకు పంపవలెను.

గోదా తిరుమలయ్య
కార్యవాహి సచివ్
స్వర్ణోత్సవాలు

# నేనెప్పుడూ ఒంటరినే

— జి. శ్రీశైలం

కష్టాలు కల్సిపోయి
పెనవేసుకు పోయాయి
దరిద్రలక్ష్మికి నేనే
కథానాయకుణ్ని కాబోలు
నన్నుపట్టి పీడిస్తుంది
పరిచయమైన ప్రతివస్తువు
ఒక్కొక్క బాకులా
ఒక్కొక్క తుపాకిలా గోచరిస్తుంది

ఈ జగత్తంతా నా మీద పడాలని చూస్తుంది
అందుకే నేనెప్పుడు ఒంటరిగా వుండాలని
కవితా తపస్సు చేయాలని
భావాలను వొక్కింత మరవక
చిరుచిరు శబ్దాలతో
ఆడుకుంటాను
మనస్ఫూర్తిగ పాడుకుంటాను

గోల్నాకా
హైదరాబాదు-13

— రాపోలు పరమేశ్వరరావు

అంబరము-ది
గంబరమై
సంబరముగా
అగుపిస్తుంది.
ముత్యాలు
ఆరబోసినట్లు-తారలు !
వజ్రాలు
రాశిపోసినట్లు-చంద్రుడు !!
ఎవరా చిత్రాన్ని గీసిన వ్యక్తి ?
ఎంతగొప్పది ఆ వ్యక్తి శక్తి !

దశాబ్దాలు
శతాబ్దాలు దాటినా...
యుగాలు
జగాలు మారినా...
మాసిపోనిది
మరపురానిది
ఆ చిత్రం !
ఆ చిత్రకారుని జన్మే
పవిత్రం !!

కొత్తరెడ్డి పాలెం
తెనాలి తాలూకా
522 228

# నువ్వు

— వి. కె. సత్యవతి

వూరు. వూరు నాగుడి
గుడి. గుడికో పేరు
పేరు. పేరుకో రూపు
రూపు, రూపు నా మార్పు
అనంతకోటి నామాలతో
అంతులేని రూపాలతో
అంగరంగ వైభవాలతో
ఆలరారే నిన్ను చూడాలని
అసలు నువ్వు ఎక్కడున్నావో కనుక్కోవాలని
నన్ను నేను తెలుసుకోవాలని బయల్దేరాను
ఊరు. ఊరునా, గుడిని దర్శించాను
పేరు, పేరునా, నిన్ను స్మరించావు
రూపు, రూపునా, నిన్ను అర్చించాను
పూలదండల వెనక, రాతిబండలేగాని
కర్పూరహారతులమధ్య, కఠినశిలలేగాని
ఏమీకల్పించలేదు.
పిలిచి, పిలిచి విసిగి
వెతికి, వెతికి వేసారి
అలసి, సొలసి, ఆత్మావలోకనంచేసుకున్నాను.
అప్పుడు తెలుసుకున్నాను
అనంతా కాశమంతానువ్వని
అంతులేని సంద్రమంతానువ్వని
పాలమనసులోనువ్వని
పాపనవ్వులో నువ్వని
పీచేగాలిలో నువ్వని
పూచేపువ్వులో నువ్వని
అణువణువునా నువ్వని
అంతటా నువ్వేనని
'నేననేదే లేదని
నువ్వు లేనిదేదీ లేదని

కన్నడ మూలం
పద్మభూషణ డా॥ కె. వి. పుట్టప్ప

ఇటు దారిలేదు నీకు; వ్యాధుడా:
ఇది పక్షికాశి !
దేవనదిలోన దీపకృపలోన
భావరసోర్వశి
ప్రాణిపక్షికులమందు రక్షలో
నిత్యమవినాశి :
శక్తి చుట్టునూ కావలిదిగో కను
అగ్ని జలరాశి :

తెలుగు అనువాదం
మార్కండపురం శ్రీనివాస

చంపు బత్తడిక విల్లుబాణమును
అట్టెపెట్టి రా;
బింకపుయుక్తిని కొంకుయుక్తినీ
అన్ని విడిచిరా;
ఒడలు కడిగిరా, చేలుమోడ్చిరా,
అహం వదలి రా:
ఇతు మధురమను మోక్షపక్షిధ్వని
నాడి నాడిలో ఆడిపాడి ఆ
నందింతమురా !

# దాశరథి-అనువాదరీతి

— దాశరథి విజయలక్ష్మి

'కవిత్వమొక తీరని దాహం'—అన్నారు మహాకవి. నిజమే ! ఆ దాహం ఏ నాటికీ తీరనిదే. అదే తీరేదాహమైతే ఈనాడు కవికి కవిత్వానికీ ఇంతటి విలువ, గౌరవం ఉండేవికావు. కవిస్థానం ఆకాశంలో ధ్రువతారగా మారేదికాదు.

చిన్నతనంలోనే దాశరథిగారి హృదయంమీద గాలిబ్ "మతోన్మాదులు విహరించిన నేలన మతాతీతుడుగా, సంప్రదాయజ్ఞులు కలిసినచోట సంప్రదాయ భేదకుడిగ, పురాతనత్వమే ఆదర్శమని నమ్మినచోట అతినవ్యుడిగా ముద్రవేసుకున్నాడు. ఆయనలోని క్లుప్తత, ఆప్తత, గుప్తత వీరిని ముగ్ధుల్ని చేశాయి. అందుకే ఉరుదూ భాషలో వెలిసిన 'గాలిబ్ గీతాల' అమృత భాండాన్ని తెలుగుదనంలో తెలుగులో వీరు ముంచెత్తారు.

చిన్నతనంనుండి ఉర్దూమీడియంలో చదపటంవల్లా, ఉర్దూ, పర్షియన్ భాషాసాహిత్యాలతో బాల్యంనుంచే పరిచయం అయింది. వీరికి పాఠశాలలో ఉర్దూ, ఫారసీ భాషలను బోధించే జక్కీసాహెబ్ పాఠ్యవిషయాలను పక్కకుపెట్టి గాలిబ్ కవితల్లోని పాదాలను చదివి అందులోని సౌందర్యరహస్యాలను విద్యార్థులకు తెలిపేవారు. ఈ విధంగా బాల్యంనుండి 'గాలిబ్ మహాకవి'పై ఏర్పడిన మక్కువ దాదాపు ఇరవై సంవత్సరాల తర్వాత 'గాలిబ్ గీతాల అనువాదానికి' హేతుభూతమయింది,

'దాశరథిలోని 'రొమాంటిక్ ఇన్‌స్టింక్ట్ Romantic insiict) గాలిబ్ కవితలను అనువదించటానికి కారణం' అని డి. రామలింగంగారు అన్నారు.

శ్రీ దాశరథికి మిక్కిలి సన్నిహితులు మఖ్దూం మొహియుద్దీన్. వీరు 'సూరజ్ సబ్‌రా,' 'గుల్ అత్తర్'—అనే పుస్తకాలను రాశారు. వాటిని వీరు అనువదించారు. మీర్ కవితలను అనువదించారు,

రుబాయి ప్రక్రియని, తెలుగులో ప్రవేశ పెట్టిన ఘనత, మొట్టమొదట తెలుగులో 'గుజల్'ను రాసిన ఘనత వీరికే దక్కుతుంది. తమ అనువాద రీతిని గురించి తెలుపుతూ అయఃపేటికలో భద్రపరచబడిన మణిని సాధించడం ఎంత కష్టమో పద్యాలలో దాగిన గాలిబ్ హృదయాన్ని అందుకోవడం కూడా అంతే కష్టం. ప్రతి పద్యాన్ని ఆకళించుకొని ఆ పద్యానికి వివిధ వ్యాఖ్యాతలూ, విమర్శకులూ చెప్పిన అర్థాన్ని చదివి నాకుస్ఫురించిన అర్థాన్ని జీర్ణించుకుని, తేన్పి తెలుగురూపంలో మళ్ళీ ఆ హృదయాన్ని ఆవిష్కరించటం కొంత క్లిష్టమైన పనే.... అన్నారు దాశరథి.

ఉర్దూ కవితలో 'గజల్' రచనా పద్ధతి రెండు వందల సంవత్సరాల క్రితం ప్రారంభమైంది ఇది శృంగారాత్మకమైన భావకవిత.

స్వాతంత్ర్య యోధుడే కాక బహుభాషావేత్త, వక్త, కవి, కథకుడు, నాటక కర్త అయిన దాశరథి ఈ అనువాద ప్రక్రియను చేపట్టటం వలన ఒక గొప్ప అనువాదకుడు కూడా అయ్యాడు. వీరు ఈ అనువాదాన్ని మిక్కిలి ప్రతిభా వంతంగా నిర్వహించారు,

అనువాద ధోరణి చాలా సరసంగా వుంది. స్వీకరించిన ఛందస్సు, భాషఔచిత్య శోభితంగా ఉన్నాయి. అనువాదకునికి మూల గ్రంథ కర్తతో సమానమైన భావనా శక్తి అవసరం ఆ భావనాశక్తి వీరికి సంపూర్ణంగా వుంది అని ఇందులోని ప్రతి పంక్తి నిరూపిస్తుంది. అందుకే దీనికి "ఉత్తమ అనువాద గ్రంథం"గా 1960లో రాష్ట్ర ప్రభుత్వంచేత సాహిత్య అకాడమీ బహుమతి పొందింది. వీరు సుప్రసిద్ధ ఉర్దూ నవల "గుజస్తా లక్నో"—ను తెలుగులోకి అనువదించారు.

"లోకమందు సుఖము, శోకము గలదండ్రు,
శోకమొకడె యిచ్చెనాకు బ్రహ్మ—
"గుడిని శివుడు దొరకకున్న కాశికి గాని
పరుగులెత్తి నేను బడమయ గలను—"

ఈ పద్యపాదాలు దాశరథికి ఉరుదూ, ఫారసీ భాషలలో గల ప్రావీణ్యానికీ, ఆ సంప్రదాయాలతో గల పరిచయానికి, దానిని మన హిందూ వాతావరణంలోకి తీసుకొని రావటంలో గల శక్తి సామర్థ్యాలకు మంచి తార్కాణం.

'గజల్' లోని కొన్ని 'షేర్' లనే వీరు ఆంధ్రీకరించారు. ఉత్తమ విభాగాలను ఎన్నుకోవటంలో వీరి కవితా హృదయం, ప్రతిభ ప్రతిబింబిస్తున్నాయి.

ప్రేమను గురించి చెపుతూ—
'వలపు లే నాడు గాని నిష్ఫలము గావు,
కాయకాయని వృక్షమ్ము కాదు వలపు

—అన్నారు.

"ప్రణయ బాధితులను గూర్చి పలుకవశమె?
పాదముల నుండి తలదాక బాధయొప్పు.
—ప్రణయబాధ అలాంటిదట.

వీరి అనువాదంలో స్వతంత్రత కనిపిస్తుంది. గాలిబ్ హృదయాన్ని తనకు నచ్చిన విధంగా తెలుగు వారికి ఆవిష్కరించాడు. ఉర్దూ కవులలో క్లుప్తత ప్రధానం, వీరి అనువాదం కూడా ఇదే మార్గంలో నడిచింది.

దాశరథి గాలిబ్ రచనలనే కాకుండా మీర్, జఫర్ రచనల్ని కూడా ఆంధ్రీకరించారు.

సీసానికి శ్రీనాథుడిలా 'గజల్' అల్లడంలో అందె వేసిన చేయి 'మీర్'ది సూఫీ వేదాంతం, వియోగ శృంగారం, భావగాంభీర్యం వీరి గజళ్ళలో కనిపిస్తాయి, 'గాలిబ్' అనువాదంలా ఇదీ సాగింది.

"దేహమిది బుద్బుదమై తిరుగుచుండె,
విశ్వమిది మృగతృష్ణయై పెరుగుచుండె,
"నావేదనను వ్రాసినాను పొత్తమున
పొత్తము కన్నీట మెత్తబడి పోయె.

జఫర్ అసలుంపేరు బహద్దూర్‌షా. ఉర్దూ సాహిత్యంలో వీరిది విశిష్ట స్థానం. ఈయన తన కవిత్వంలో ప్రణయ వియోగ మాధుర్యాన్ని సుకుమార పద్ధతిలో వర్ణించారు.

"సాఖి కిలకిల నవ్విన సమయమందు
పాన పాత్రలు కళముల్ ఫక్కుమనెను"
"గోష్ఠి నుండి ఆయన జారుకొనుటతోనే
కనక దీపమె ఉరిపోసి కొనిన దంట"

వీరు తమ మిత్రులైన కేరాలాత మోరియా ఉర్దూ కవితల్ని, మిన్నేటి పొంగులు అనే కావ్యాన్ని ఆంధ్రీకరించారు. వీరి కవిత్వంపై జోష్, జౌక్, మీర్ తఖ్ మీర్, సౌదాల ప్రభావం కన్పిస్తుంది.

విశ్వకవి రవీంద్రుడుంటే దాశరథికి విశిష్టమైన అభిమానం. అందుకే వీరి రచనల్లో కొన్నింటికి అనువాదాలు కొన్నిటికి అనుసరణలు చేశారు. ఇక్కడ కూడా వీరు భావానువాద పద్ధతినే అవలంబించారు.

'గీతాంజలి'లోని 3౩వ ఖండికను 'రారమ్మ' శీర్షికతో అనువదించి అగ్నిధారలో ప్రచురించారు.

"మనసు క్రోధాన బండబారినపుడెల్ల
కనికరపు వానజల్లుతో కదలిరమ్మ,
స్వాంత మందు కారుణ్యంబు సడలు నెడల
అమరగానము తోడ నన్నరసి పొమ్మ"

ఇది మూలానికి యథాతథమైన అనువాదం. కానీ స్వతంత్రంగా కనిపిస్తుంది రవీంద్రుని గీతాలను చాలా వాటిని అనువదించారు వీరు.

హిందీ సాహిత్యంలో సుమిత్రా నందన్ పంత్ రచనల్ని కొన్నిటిని తెనిగించారు వీరు.

ప్రథమ రశ్మిలో—

'తొలి వెలుతురు రేకల రాకల నెటు
తెలిసితివే వ్యోమ కురంగి
నిరాయాసముగ ఈ గానము నెటు
నేర్చితివే బాల విహంగి,

ఇంకా ఈ విధంగానే 'గ్రామయువతి' 'నౌకా విహారము' 'సన్న జాజి' పర్వత ప్రదేశంలో వర్షం మొదలైన పది ఖండికలను తెలుగులోకి అనువదించారు.

వీరికి అభిమాన వస్తువులైన ప్రకృతి వర్ణన, గాంధీజీ అరవిందయోగి మొదలైన విషయాలనే అనువాదానికి ఎన్నుకున్నారు. ఉర్దూ నుండి ఆంగ్లం నుండి చేసిన అనువాదాల్లో భావానికి ప్రాధాన్యతనిచ్చి అనువాదం చేశారు. కాని, హిందీ అనువాదాల్లో కేవలం పదానువాదం చేసినట్లుగా కనిపిస్తుంది.

వీరి అనువాదం అనన్య సామాన్యమైన ఒక వైభవం. తమ సునిశిత పరిజ్ఞానంతో, అన్యభాషా పాటవంతో కృధ్గత సాధ్యమైన రీతిలో వీరు మనకు అనువాదాలను అందించారు. అందుకే— అన్యభాషా కవితా కుసుమ సౌరభాన్ని ఆంధ్రభాషా యోషాకచ బంధంలో గుబాళింప చేసిన వీరి లేఖినిదే అదృష్టం.



# కవి–వ్యాఖ్యాత

— డా॥ శ్రీ రాణి శ్రీనివాసశాస్త్రి

కాళిదాసు మహాకవి చాలా గొప్పవాడు. సర్వజ్ఞుడు ఆదికవి వాల్మీకి మహర్షి తరువాత వేదములను విభజించి, భారతమును రచించిన వ్యాసమహర్షి తరువాత చెప్పదగిన కవి, అని అనుటతో సందేహము లేదు. అయితే లోకములో అక్షర జ్ఞానము లేని అతి సామాన్యుని దగ్గర నుండి ఆరు శాస్త్రములను చదువు కొనిన మహాపండితుడు వరకు కాళిదాసు గొప్పవాడు కాళిదాసు గొప్పవాడు, కాళిదాసు గొప్పవాడు అని అనే వారే గాని కాళిదాసు ఎలా గొప్పవాడు? కాళిదాసు ఏ యే గొప్ప విషయాలను చెప్పాడు? మిగిలిన కవులకు కాళిదాసుకు ఉన్నతేడా ఏమిటి? అనే ఆలోచన చేయువారు కనపడరు. కాళిదాసు కంటె కఠిన శైలిలో కాళిదాసు కంటె సుందర పద సమూహములను సుందర వృత్తములతో ఏర్చి, పేర్చి పెట్టి కావ్యములను రచించిన కవులెందరో గలరు. అయినను కాళిదాసు గొప్పవాడని చెప్పుటయే అందరికీ అలవాటైపోయినది ఈ నాటి పండితులు కొంత మంది కాళిదాసుకు ఇతర కవులకు తారతమ్యము చెప్ప లేని స్థితిలో యున్నారు. కారణమేమనగా ఈ నాటి పండితులు ఏ తర్కమో, వ్యాకరణమో చదువుకొని ఈ శాస్త్రముల కంటెను పరమ ప్రమాణములగు శ్రుతి స్మృతి పురాణముల పేర్లను గూడ మరచిపోయి మనకు విద్య పూర్తి అయిందని అనుకునే స్థితిలో ఉండుట చేత, కాళిదాసు గొప్పవాడని అందరితో బాటు అంటున్నారే గాని ఎట్లు గొప్పవాడో, నిరూపించలేని స్థితిలో యున్నారు. ఇక గ్రంథవిస్తర భీతిచే, అతి సంక్షేపముగా కాళిదాసుని గొప్పతనమును గూర్చి పరిశీలింతము. ఈ కాళిదాసు తన గ్రంథముల యందు అడుగడుగునా శ్రుతి, స్మృతి పురాణములోని సారభూత విషయములను షట్ శాస్త్రముల లోనూ, షట్ దర్శనములలోను చతుష్షష్టి కళలలోను సారభూతవిషయములను తన గ్రంథముల యందు తాను వ్రాసిన చరిత్రలయందు, ఆయాసమయముల యందు అర్థాంతర న్యాసములలో సువర్ణమయ మాల యందలి రత్నములవలె పొందు పరచెను.

అయితే ఈనాడు పండితులందరూ కాళిదాసునికావ్యములను చదివినవారే, అయిననూ అందులో కొందరు కాళిదాసు గ్రంధములయందు ఈ అద్భుతవిషయములున్నవని మాత్రము చెప్పలేక పోతున్నారు. ఏమనగా (1)తాము స్వయముగా శ్రుతి స్మృతిపురాణాది జ్ఞానము లేనివార గుట చేతను, (2)ఆ కావ్యములకు వ్యాఖ్యాత మల్లినాధ సూరి అగుట చేతను. మల్లినాధ సూరి తాను చాలా శాస్త్రములను చదువుకొన్నట్లు వ్రాసుకొని యున్నను ఈయన వ్యాఖ్యానమును పరిశీలించగా ఈతనికి అభిమాన శాస్త్రము వ్యాకరణమొక్కటే యనియు ఇతర శాస్త్ర పరిచయము తక్కువ అనియు అర్థముగాక మానదు. ఏమనగా కొన్నికొన్ని శ్లోకములకు, విశిష్ట విజ్ఞానము గల వాటికి తప్పుడు వ్యాఖ్యాలల్లెను. వ్యాఖ్యాత గూడా సర్వజ్ఞుడయి కాళిదాసుని అర్థము చేసుకొని , వ్యాఖ్యానించిన యెడల కాళిదాసుని యొక్క యదార్థజ్ఞానము అందరికీ విస్పష్టముగా తెలిసేది, ఈ క్రింది ఉదాహరణలో

చూడండి: కాళిదాసుని సర్వజ్ఞత్వమూ, కొన్ని చోట్ల మల్లినాథుని అల్పజ్ఞత్వమూ కనపడతాయి ముందుగా కాళిదాసుని గ్రంథములలోని మొదటి గ్రంథముగా చెప్పబడుతున్న "రఘు వంశ మహా కావ్యము" నందలి కాళిదాసుని శ్రుతి స్మృతుల యందాశక్తిని పరిశీలింతము.

శ్లో॥ వనాంత రాదు పావృత్తైః
సమిత్కుశ ఫలాహారైః ।
పూర్యమాణ మదృశ్యాగ్ని ।
ప్రత్యుద్యాతై స్తపస్విభిః ॥
ఇతి రఘువంశే ౧-౪౯.

తా॥ దిలీపమహారాజు తనభార్యయగు సుదక్షిణాదేవితో సహా, వశిష్ఠాశ్రమమునకు చేరెను. ఆ సందర్భములో కాళిదాసు ఆ వశిష్ఠాశ్రమ మండలమునిట్లు వర్ణించెను. ఆ హితాగ్నులగు యజమానులు, ఇతర తపోవనములకు వెళ్ళి సమిధలు, దర్భలు ఫలములు వాటిని తీసుకొని తమ తపోవనమునకు వచ్చు సరికి అదృశ్య రూపములో ఉన్న తమ యొక్క త్రేతాగ్నులగుగార్హపత్య, అహవనీయ, దక్షిణాగ్నులచే ఎదురేగబడిన తాపసులచే, అన్ని వైపులా పూరింప బడుచున్న ఆ తపోవనమునకు సుదక్షిణాదేవి, దిలీపులు చేరిరి. అనగా సాయంకాల సమయము నందు తమ ఆశ్రమముల నుండి ఇతర తపోవనములకు వెళ్ళిన మహర్షులు తిరుగా తమతమ ఆశ్రమములకు సాయంకాల సంధ్యావందన అగ్ని హోత్రాదులను నిర్వర్తించుటకు సమిధలు దర్భలు ఫలములు మొదలగు వాటిని తీసుకొని అన్ని వైపుల నుండి తమతమ ఆశ్రమములకు చేరుచుండిరి. అహితాగ్నులగు వారు ఆశ్రమముల నుండి ఇతర ప్రదేశములకు వెళ్ళి తిరుగా తమ ఆశ్రమములకు వచ్చునపుడు తమచే ఉపాసింపబడుచున్న త్రేతాగ్నులు, అనగా గార్హపత్య, ఆహవనీయ దక్షిణాగ్నులు, తండ్రి గ్రామాంతరమునకు వెళ్ళి తిరిగి ఇంటికి వచ్చు సరికి ఇంటిలో నున్న చిన్నపిల్లలు తండ్రికి ఎదురేగునట్లుగా ఎదురేగునని వేదము చెప్పుచున్నది.

శ్రుతి:- ప్రోష్యాగచ్ఛతా మాహితాగ్నేనా. మగ్నయః ప్రత్యుద్యంతి॥ ఇతి

అని వేదములోని విశేషమును కాళిదాసు ఈ చరిత్రలో ఉదహరించెను.

కాళిదాసుని స్మృతుల యందాశక్తి:-

స్మృతులు (ధర్మశాస్త్రములు) శ్రుతిని అనుసరించియే యుండును. అని ఇట్లు నిరూపించెను.

శ్లో॥ మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ।
శ్రుతేరి వార్థం స్మృతిరన్వగచ్ఛత్॥
ఇతి రఘువంశం ౨ సర్గ ౨ శ్లోకం

తా॥ ఆ దిలీప మహారాజు యొక్క భార్యయగు సుదక్షిణాదేవి, ఆ వశిష్ట మహర్షి యొక్క నందినీ ధేనువు యొక్క గిట్టలతో పవిత్రమగు రేణువులు గల మార్గమును వేదార్థమును మన్వాది స్మృతులు అనుసరించినట్లు అనుసరించెను.

శ్లో॥ సబభూవ దురాసదః పరైః
గురుణా థర్వ విదాకృతక్రియః।
పవనాగ్ని సమాగ మోహ్యయం।
సహితం బ్రహ్మయ దస్త్ర తేజసా॥
ఇతి రఘు వంశే ౮ సర్గ ౪శ్లోకం.

తా॥ అథర్వణ వేదవేత్తయగు గురువయిన వశిష్ఠ మహర్షి చేత చేయబడిన పట్టాభిషేక సంస్కారము గల్గిన అజ మహారాజు శత్రువులకు దురాసదుడాయెను. ఏమనగా? అస్త్ర తేజస్సుతో, అనగా క్షత్రియ తేజస్సుతో, గూడిన బ్రహ్మ తేజస్సు వాయువు, అగ్ని కలిగిన ఎట్టిదో అట్టిది గదా!

ఈ బ్రహ్మక్షత్రియ తేజస్సుల సమాగమము

యొక్క, ఆవశ్యకతను గూర్చి మనుస్మృతిలో ఇట్లు చెప్పబడెను.

శ్లో॥ నా బ్రహ్మక్షత్ర మృధ్నోతి ।
నా క్షత్రం బ్రహ్మ వర్ధతే ।
బ్రహ్మక్షత్రేశు సంయుక్తే ।
ఇహాముత్రచవర్ధతే ॥

ఇతి మను స్మృతౌ 9. అధ్యా. 322 శ్లో.

తా॥ బ్రహ్మతే "జసహాయము లేని క్షత్ర తేజస్సు గాని, క్షత్రతేజస్సహాయము లేని బ్రహ్మ తేజసు గాని వృద్ధిని పొందజాలవు. బ్రహ్మక్షత్ర తేజస్సులు కలిసిన యెడల ఈ లోకము పరలోకము గూడ వృద్ధిని బొందును. ముల్లోకములు సుభిక్షముగా నుండు నని భావము. ఈ మను స్మృత్యర్థమునే కాళిదాసు పై శ్లోకములో పొందు పరచెను. ఇంకా యిలాంటి ఉదాహరణములు ఎన్నో వున్నవి. ఈ నాటి వారు కొందరు గొప్పగొప్ప సైన్సులను కని పెట్టారనియు, ఈ సైన్సులు పూర్వ కాలము వారు యెరుగరనియు అని అనుకొనే కొన్ని సైన్సులను కాళిదాసు అతి హేలగా తన గ్రంథములలో యే రీతిగా ఉపమానములతో, అర్థాంతరన్యాసములుగా ఉదహరించెనో చూడుడు.

శ్లో॥ స్నిగ్ధ గంభీర నిర్ఘోషం ।
ఏకం స్యందన మాస్థితౌ ।
ప్రావృషేణ్యం పయోవాహం ।
విద్యుదైరావతా వివ ॥

ఇతి రఘువంశే 1. సర్గే 36 శ్లోకం.

తా॥ గంభీరమయిన మధుర ధ్వనిగల ఒకే రథము మీద సుదక్షిణా దిలీపు లిద్దరూ కూర్చుని యున్నారు. యెట్లనగా? మధుర గంభీర ధ్వని గల వర్షాకాలపు మేఘమును, విద్యుత్, ఐరావతముల వలనే అధిష్ఠించి యున్నారు. అనగా ధన విద్యుత్, ఋణ విద్యుత్ లేక స్త్రీ విద్యుత్ పురుష విద్యుత్ (నెగిటివ్ కరెంటు, పాజిటివ్ కరెంటు)ల వలెనే యున్నారు.

ఆ సుదక్షిణాదిలీపు లిద్దరూ వేషము నందలి మెరుపు తీగెవలె రథమునందు యేక స్థాన స్థితులై యున్నారు, అని అర్థము మేఘమునందు ధన. ఋణ విద్యుత్‌లు రెండూ వుంటేనే వర్షము కల్గును. విడిగా ఒక్క విద్యుత్ వల్ల వర్షము రాదు. అట్లే రథము మీద వుండి సంతానము కొరకు, వశిష్ఠాశ్రమమునకు పోవుచున్న సుదక్షిణాదిలీపులిద్దరి వలన రఘు మహారాజు పుట్టబోవు చున్నాడనే సూచనను కాళిదాసుసూచించియుండగా మల్లినాథుడు యిట్టివిజ్ఞానము లేని వాడగుట చేత అవకతవకగా డొంక తిరుగుడు వ్యాఖ్యానమును చేసెను. ఎట్లాగా? "ఇరాః ఆపః" ఉదకములు "ఇరావాన్ సముద్రః" అనగా నీరుగల వాడు సముద్రుడు "తత్రభవః" (సముద్ర భవః) ఐరావతః" ఆ సముద్రము నందు పుట్టినది ఐరావత గజము ఐరావతో భ్రమాతంగః" అని అమరము నందు గలదు. "ద్యోది వౌ ద్వేస్త్రి యామభ్రం వ్యోమ పుష్కర మంబరం" అనియు, "అభ్రం మేఘోవారి వాహః" అనియు అభ్ర శబ్దమునకు ఆకాశ మనియు, మేఘ మనియు రెండు అర్థములు కలవు. ఇచట "అభ్రమాతంగః" అనగా ఆకాశము సంచరించు గజమని యర్థముకాగా, మల్లినాధుడు మేఘమును వూహించుకొని యిట్లు వ్యాఖ్యానించెను. "అభ్రమాతంగత్వం చాస్య అభ్రస్థి తత్వాత్ అభ్రరూపత్వాద్వా ఇతి క్షీర స్వామీ, అత ఏవమేఘారోహణం విద్యుత్సాహ చర్యం చఘటతే, కించ, విద్యుత ఐరావత సాహచర్యా దేవ ఐరావతీ సంజ్ఞాపి, ఐరావతస్య స్త్రీ ఐరావతీ ఇతి క్షీర స్వామీ, తస్మాత్సుష్ఠూక్తం విద్యు దైరావతా వివేతి ఏకరథారోహణోక్త్యా కార్య సిద్ధేర్బీజం దంపత్యో రత్యంత సామన స్యంచ సూచయతి" అని వ్యాఖ్యానించెను. ఈ ఐరావత గజము మేఘము మీద వుండునది గావున లేక మేఘ రూపమున వుండును గావున అభ్రమాతంగమైనదని క్షీర

స్వామిగారు చెప్పారుట గూడ. ఈయనకు తోడు కాబట్టి యీ ఏనుగుకు మేఘారోహకత్వము విద్యుత్సాహ చర్యము కల్గుచున్నవట. మరియు యింకొక వింత విషయమేమిటంటే? విద్యుత్తుకు యీ ఐరావతముతో తిరుగుట వల్ల "ఐరావతి" అను పేరు కూడా కలదట. ఐరావతము యొక్క భార్యకాగా "ఐరావతీ" అయినదని క్షీర స్వామిగారు చెప్పారట. అందుచేతనే కాళిదాసు గారు గూడ "విద్యుదైరావతా వివ" అన బాగుగా చెప్పిరట. ఏకరథారోహణమనుటచే, కార్యసిద్ధికి బీజము దంపతులకు అత్యంత ప్రీతిని సూచిస్తున్నది, అని మల్లి నాథుడు త్రిప్పి, త్రిప్పితల కాయకు రోకలి చుట్టినట్లు అర్థము లేని వ్యర్థ వ్యాఖ్యానమును చేసెను. అసలు ఇరాః = ఆపః అంటె నీరు అంతవరకే నిజము. ఇక ఆపైన ''ఇరావాన్" అంటె సముద్రము. అందు పుట్టిన ఐరావతము దాని సాహచర్యము వలన దానికి భార్యయయి మెరుపు ఐరావతీ అగుట, ఇవన్నియూ ఆకాశపురాణము లాగున వ్రాసెను. ఇదంతయు అసందర్భమే. ఇచట సరియగు యర్థము యేమనగా? "ఇరావాన్'' అంటే మేఘము "ఇరావతి (మేఘె) భవా ఐరావతీ" మేఘమునందు బుట్టునది మెరుపుగాని ఏనుగు కాదు. ఈ క్రింద చూడుడు

శ్లో॥ ఐరావతోఽ భ్రమాతంగ నారంగ
లికుచాహిషు ।
ఐరావతం మహేంద్రస్య
ఋజుదీర్ఘ శరాసనే ।
ఐరావతీస్యాత్సరితి
తడిద్భేదేఽ పిలక్ష్యతే ॥

ఇతి విశ్వః

ఈ విధముగా, ఐరావత, శబ్దమునకు, ఐరావత గజముతో సంబంధము లేకుండగనే, నారింజపండు, నిమ్మపండు, సర్పము, ఇంద్రధనస్సు, నదీవిశేషము, విద్యుద్విశేషము మొదలగు యర్థములు గలవు ఈ విద్యుత్తులలో స్త్రీ పురుష భేదములున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది ఈ స్త్రీ పురుష విద్యుత్తులే, ధన, ఋణవిద్యుత్తులు. యీ రెండునూ కలిసినప్పుడే మెరుపులు, ఉరుములు, పిడుగులు, వర్షము మొదలగునవి పుట్టుచున్నవి. ఈ రెంటి సంయోగము లేనిచో యే కార్యము జరుగదు. ఈ విషయము సాధారణముగా కొందరికి తెలియును. ఈ విద్యుద్విభేదమును బాగుగా నెరిగిన కాళిదాసు సుదక్షిణా దిలీపులకు ఉపమానముగా నిచ్చెను. సుదక్షిణా దిలీపులిద్దరూ ఆ ఏక రథము మీద మెరుపు తీగలవలె ప్రకాశించుచున్నారని చెప్పియుండగా, యీ విద్యుద్విజ్ఞానమేలేని మల్లినాథుడు మేఘముమీద ఏనుగును, ఆ ఏనుగుప్రక్కన భార్యగా వున్న మెరుపునుతాను వూహించి వ్యాఖ్యానించాడు. మేఘముమీద ఏనుగును మల్లినాథుడు గాని యింకొకరు గాని చూచియుండిరా? చూడగలరా? ఆ దిలీపుని, పెద్ద ఏనుగుగాను, సుదక్షిణాదేవిని ఒకేసారి కంటికి కనపడి వెంటనే అంతర్థానము నొందే మెరుపు లాగుననూ వూహించి, ఆ సందర్భపు వ్యాఖ్యను చేసెను.

మరియు, యీ మల్లినాథ వ్యాఖ్యకు యింకొక వుదాహరణను చూడండి.

శ్లో॥ కామం నృపాస్సంతు సహస్రశోఽన్యే
రాజన్వతీ మాహురానేన భూమిం।
నక్షత్ర తారాగ్రహ సంకులాపి।
జ్యోతిష్మతీ చంద్రమసైవరాత్రి

ఇతి రఘువంశే 6 సర్గ 22 శ్లో.

తా॥ ఇందుమతీ. స్వయంవరమునకు వచ్చిన రాజులను గూర్చి వర్ణించుచూ సర్వజ్ఞుడగు కాళిదాసు యే చిన్న విషయమును గూర్చి చెప్పినను, యే చరిత్ర విషయములను గూర్చి చెప్పుచున్నను ఉదాహరణలతో ఉపమానములతో, అనేక శాస్త్రరహస్యములను చెప్పే సహజ స్వభావము గల వాడగుటచే, ఒకానొకరాజును

గూర్చి వర్ణించుచూ, జ్యోతిష పరిభాషను యిట్లు చెప్పెను.

రాజులు ఎంత మంది యున్ననేమి? ఈ రాజు వుండుటచేతనే. యీ భూమి రాజన్వతీ అయినదని చెప్పదురు. ఎట్లనగా? పగలు సూర్యరశ్మిలో, నక్షత్రములు, గ్రహములు ఎన్ని యున్ననూ కంటికి కనబడవు గదా? ఇక రాత్రి యందు నక్షత్రములు, తారాగ్రహములు, అనగా, కుజ, బుధ, గురు, శుక్ర, శనులు వున్ననూ చంద్రుడుంటేనే వెన్నెల రాత్రి యగును.

ఆ చంద్రుడు లేనిచో ఎన్ని నక్షత్రములున్ననూ, తారాగ్రహములైదువున్ననూ, వెన్నెల రాత్రికాదు. అని యీ శ్లోకములతో కాళిదాసు పూర్వార్థమున, ప్రస్తుతపురాజును వర్ణించి। మిగిలిన అర్ధశ్లోకమున జ్యోతిష పరిభాషను ఉదాహరణగానిచ్చెను. ఎట్లనగా జ్యోతిషములోని. గ్రహములు, బింబగ్రహములు, తారాగ్రహములు, ఛాయాగ్రహములు, అని మూడు విధములు. వీటిలో బింబగ్రహములనగా, సూర్య చంద్రులు, ఛాయాగ్రహములనగా। రాహుకేతువులు ఇక తారాగ్రములనగా కుజ బుధ, గురు, శుక్ర శనులు ఐదుగురు. ఈ జ్యోతిషపరిభాషగూడయీ చెప్పబడు చున్న చరిత్రతో బాటు చెప్పియుండెను. అయితే యిచట వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి, జ్యోతిషము తెలియని వాడగుటచేత, నక్షత్ర తారాగ్రహనుసరికి నక్షత్రమన్నను, తారయన్నను, ఒక్కటే యర్థము గదా! కాళిదాసు యేదోపొరపాటున చెప్పియుంటాడని ఊహించుకొని నక్షత్ర, తారా శబ్దము పునరుక్తులను కొనినాడు.. "తారాగ్రహ" మనగా జ్యోతిష పరిభాష తెలియనివాడగుటచే ఏకవచనమని తోచకతాను యిట్లుసమర్థించెను "నక్షత్రైః అశ్విన్యాదిభిః, తారాభిః సాధారణై ర్జ్యోతిర్భిః గ్రహైః భౌమాదిభిః" అని వ్యాఖ్యానించెను. ఆకాశములోని జ్యోతిస్సులు రెండే విధములు. తిరిగేవి, తిరగనివియని. తిరిగేవి గ్రహములు, తిరగనివి నక్షత్రములు. ఈ వివేచనా జ్ఞానము జ్యోతిశ్శాస్త్రము తెలిసిన గల్గును జ్యోతిషము తెలియనిచో ఈ వ్యాఖ్యవలెనుండును.

మరియు మల్లినాథుని వ్యాఖ్యకు యింకొక చిన్న ఉదాహరణనిచ్చియీవ్యాఖ్యానమింతటితో ముగింతును.

శ్లో॥ అథోరగాఖ్య స్యపురస్య నాథం
దౌవారికీ దేవసరూపమేత్య
ఇతశ్చ కోరాక్షివిలోకయేతి పూర్వాను
శిష్టాం నిజ గాథభోజ్యాం
పాండ్యోయమం సార్పితలంబహారః
క్లుప్తాంగ రాగోహరి చందనేన
ఆభాతి బాలా తపర క్త సానుః
సనిర్ఝరో ద్గార ఇవాద్రిరాజః

ఇతి రఘువంశే 6 సర్గ 58 60

తా॥ ఉరగ పురాధీశుడగు యీ పాండ్య మహారాజు హారములతోను, హరిచందనముతో గూడిన అంగరాగమున్నా గలవాడై, ఎఱ్ఱని లేత ఎండతోను, సెలయేర్లతోనూ గూడిన పర్వతరాజగు హిమవత్పర్వతము వలెనున్నాడని వర్ణించెను.

ఆచట వ్యాఖ్యాతయగు మల్లినాథుడు యిట్లు వ్యాఖ్యానముచేసెను. "ఉరగాఖ్యంసపురస్య, పాండ్య దేశే కాన్యాకుబ్జతీర వర్తినాగపురస్య నాథం ఏత్య" అని వ్యాఖ్యానించెను. ఈ మల్లినాథుడు "ఉరగపురం" అనగానే, ఎచ్చటనూ సంబంధము లేని కాన్యకుబ్జమును ఎత్తుకున్నాడు.

"కాన్యకుబ్జము" యనునది, దేశమో. పట్నమో నదియో, అర్థముగాక ఉత్తర భారతదేశంలోని పాంచాలదేశానికి ఒకప్పుడు ముఖ్య పట్టణమయిన ఆకాన్య కుబ్జమును ప్రస్తుతము కనేజ్ అని పిలచు చున్నపట్టణమును) నదిగా భావించుకొని ఆ కాన్యకుబ్జ

తీరమున దక్షిణభారతదేశంలోని పాండ్యదేశమునకు (కావేరీనదీ సాగర సంగమమువద్ద ఒకప్పుడు ముఖ్య పట్నముగాయున్న నాగపట్నము (ఉరగపురము) ఉన్నదనుకొని ఊహించి వ్రాసాడు. ఈ విధముగా సర్వజ్ఞుడగు కాళిదాసుని కావ్యములకు. స్వల్పజ్ఞుడగు మల్లినాథసూరి వ్రాసిన వ్యాఖ్యలు ఎట్లున్నవో చదువరులు చూచితిరి గదా! ఇలాంటివి, ఇంకా యెన్నో వందలు గలవు. అయితే గ్రంథ విస్తర భీత్యాయింతటితో ఆపుచుంటిని, ఈ మారు మల్లినాథుడు కుమార సంభవమును ఎట్లు వ్యాఖ్యానించెనో పరిశీలింతము.

# మనవి

స్రవంతికి, కవితలు-వ్యాసములు సమీక్షలు పంపుచూ ఈ పత్రికా వికాసమునకు అన్ని విధముల సహకరించు రచయితలకు, కవులకు, విమర్శకులకు అభివాదములు. వీరు ఈ క్రింది సూచనలను గమనించ మనవి:—

1. ప్రచురణలకు పంపించే ప్రతి రచనకు ప్రతి లిపి దగ్గఱుంచుకొనగలరు. చిరునామా గల కవరుగాని ష్టాంపుకవరుగాని పంపవలదు.
2. రచన కాగితపు ఒక వైపునే స్పష్టముగ వ్రాసిపంపగలరు.
3. వ్యాసముగాని కవితగాని పంపినది మొదలు దానిని ప్రచురించమని విపరీతముగ జాబులు వ్రాయుచున్నారు. స్వీకరించిన రచన కనీసం మూడు మాసాలకుపైగా ప్రచురింపగలము. ఇందున గూర్చిన ఉత్తర-ప్రత్యుత్తరములు జరుపవలదని మనవి.
4. సభలు-సమావేశముల వార్తలు పంపువారు ఐదు లేక ఆరు కాగితాల మేరకు వార్తలువ్రాసి పంపుచున్నారు. ఇట్లుగాక అతి సంక్షిప్తముగ ఒక పేజీ మేరకు వార్తలు పంపమనవి.
5. కవితలు వ్యాసములు ఒకే విషయముపై ఎక్కువగ వచ్చుచున్నవి. రచయితలు గమనించ మనవి.
6. సమీక్షకు పుస్తకాలు పంపినవారు తమ పుస్తక సమీక్షలు వెంటనే ప్రచురించమని కోరుతూ జాబులు వ్రాస్తున్నారు. ఆయా సమయాల్లో తప్పక సమీక్షలు ప్రచురించ గలము. గమనించగలరు. ఇందుకు సంబంధించి ఉత్తర-ప్రత్యుత్తరములు జరపవద్దని మనవి.

సంపాదకులు



# ప్రాణస్నేహితుడు

ఇల్లిందల సరస్వతీదేవి

రావుకు ఏవారపత్రికయినా సరే - వెనుకనుంచి పేజీలు తిప్పి చూడటం అలవాటు, ముందు గ్రంథ పరిచయాలు చూస్తాడు. తరువాత తారాఫలంచూస్తాడు. తారాఫలం చూడటంలో అతడిదొక పద్ధతి. అతడికి జాతకాలలో నమ్మకము ఉండికాదుగాని—తన రాసి ఫలాలను చూసేటప్పుడు—"ఈవారంలో అధిక వ్యయం అయ్యే సూచనలున్నాయి" అని ఉంటే నిజంగా జాగ్రత్తపడతాడు. "ఈ వారంలో నీకు అకస్మిక ధనంలాభం కలుగుందని ఉంటే రావు ఆమాటను నమ్మడు. ఉదాసీనంగా ఉంటాడు. "నిన్ను చూసి అసూయపడేవారు నీకెదురవుతారు" అని ఉంటే జాగ్రత్తగా మెలుగుతాడు. "ఇంట్లో పిల్లలకు అనారోగ్యం కలుగుతుందంటే వాళ్లను ముందుగానే డాక్టరు దగ్గరికి తీసుకువెళ్లి పరీక్షలు చేయిస్తాడు. "మిత్రులతో ఘర్షణ పడతావం"టే వాళ్లను తప్పించుకు తిరుగుతాడు. "ఆవేశాన్ని తగ్గించుకుంటే మంచిద"ని ఉంటే చిత్రాలు గీసుకుంటూకూర్చుంటాడు. అదీ కాక పోతే తనకున్న ఆ చిన్నయింట్లోనే ఓమూల చదువుకుంటూ కూర్చుంటాడు.

ఇలాగే-పత్రికలలో వచ్చే రాసి ఫలితాలవల్లరావుకు తన స్వభావానికి ఒక విధమైన క్రమశిక్షణ యిచ్చే అవకాశము లభించింది. కాని-ఆశలుచూపే అంశాల మీద మాత్రం దృష్టిని పోనివ్వడు.

ఆ వారంలో అతడికి ఎంతకాలంనుంచో ఆచూకీ తెలియని మిత్రుడిని గురించిన సమాచారమందుతుందని రాశిఫలం చెప్పింది.

ఎన్నడూ ఆశల జోలికిపోని రావు కళ్లు వెడల్పు చేసికుని, కనుబొమలు పైకెత్తి మళ్లీమళ్లీ రాశిఫలితాలు చూశాడు. మిత్రుడి ఆచూకీ! ఎంతకాలంనుంచో ఎదురుచూస్తున్న మిత్రుడు అంటే ప్రాణమిత్రుడేఅయి ఉంటాడు. అతడిని గురించిన సమాచారమందుతుందా ఈ వారంలో ?

రావు ఆలోచనలో పడ్డాడు. తనకు మిత్రులు అందులోనూ ప్రాణమిత్రులెవరయి ఉంటారు ?

తాను సంఘ సంక్షేమ శాఖలో ప్రవేశించిన తరువాత పాతజీవితాన్నంతా మరచిపోయాడు. ఆఫీసు పరంగా మిత్రులెవరూ లేరు. ఇప్పుడు వచ్చేవాళ్లంతా ఏవో పనులమీద వచ్చేవాళ్లే వాళ్లవంక తలఎత్తయినా చూడడు. వాళ్లు వచ్చినపని వీలైతే అనుకూలంగా-లేకపోతే ప్రతికూలంగా జరుగుతుందని తెచ్చిపెట్టుకున్న మర్యాదతో, హోదా కలిపిన ధోరణిలో, మాట్లాడి పంపుతాడు.

తను ఇంటర్మీడిఏటునుంచీ కలిసి చదివినవాళ్లలో తనకు కాస్త సన్నిహితంగా ఉన్నవాళ్ళు ఐదుమంది. వాళ్లలో ముగ్గురు బి.ఏ తో చీలిపోయారు. పోతే ఇద్దరు తను ఎం. ఏ చేసిన తరువాత ఉద్యోగం దొరక్కపోతే 'లా' చదివాడు. ఎం.ఏ.తో ఆ ఇద్దరూ కూడా చీలిపోయారు.

ఆలోచన ఆపి, కళ్లజోడు తీసి, తుడిచి మళ్లీ పెట్టుకున్నాడు. షర్టుకాలరు సరిచేసుకుండూ ఉండగా చటుక్కున జ్ఞాపకం వచ్చింది.

నిరుద్యోగిగా ఉండటమెందుకని తనతోపాటు 'లా' కాలేజీలో చేరినవాడే విట్టు. అతడి పూర్తిపేరు పాండు రంగ విఠల్ ఛామనచాయ అయినా చూడచక్కని రూపం. చెయ్యెత్తు విగ్రహం. అతడిని ఎంతదూరం నుంచయినాగుర్తుపట్టవచ్చు. ఎందుకంటే అతడినడకలో ప్రత్యేకత ఉండేది.

తనూ అతడూ ఒకగదిలోనే ఉండేవాడు. ఒక్క గదిలో ఉన్నా ఎక్కువగా మాట్లాడుకునేవారుకాదు. హాస్టలుచుట్టూ పూలచెట్లూ ఎదురుగా లాన్ ఉండేవి. సాయంకాలం కాగానే-ఇద్దరికీ-డబ్బు చేతిలో ఎక్కువ ఆడేదికాదు కనుక-లాన్‌లో కూర్చుని కబుర్లు చెప్పు కుంటూ ఉండటం అలవాటయింది. మెల్లిమెల్లిగా హాస్టల్ బిల్లూ హోటల్ బిల్లూ అవసరానికి రావు కట్ట వలిసి వచ్చింది.

విట్టూ ఏమాట మాట్లాడినా, ఏ విషయాన్ని గురించి చెప్పినా ఏరికూర్చిన పదాల్లా - మలచిన వాక్యాలు నోటివెంబడి దొర్లేవి. మామూలు సంభాషణకూడా మరచిపోలేనంతగా గాఢమైన ముద్ర మనసుపైన వేసేవి. మాటలేకాదు-మనిషీ, అతడి వేషముకూడా అలాగే ఉండేవి. ప్యాంటువేసుకున్నా - షర్టుగుండీలు పెట్టుకున్నా, ధోవతికట్టుకున్నా ఇంటర్వ్యూకి వెళ్లు తున్నట్టుగా శ్రద్ధతో దిద్దుకునేవాడు. అతడు ధోవతి కట్టుకునే తీరు ఎంతో అందంగా ఉండేది. కుచ్చెళ్ళు చక్కగా పేర్చినట్టుండేవి.

"నిన్నుచూస్తే నాకు సిగ్గుగా ఉంటుంది" అన్నాడు రావు ఇద్దరిమధ్యా కాస్త చనవు అధికమ యిన తరువాత.

"ఎందుకు?" అన్నాడు విట్టు ఆశ్చర్యంగాచూస్తూ

"ఎందుకంటే"-ఏం చెప్పను? నాకేమీ అన్నిటిలో అశ్రద్ధ. నాషర్టుచూడు? ఒక గుండీ పెట్టుకుంటే చాల్లే ననుకుంటాను. అద్దం చూసుకోకుండా తలదువ్వు కుంటాను. ఏమిటో జీవితం ఇలా గడుస్తోంది" అన్నాడు రావు.

"దిద్దుబాటు లేకుండానే అందంగా ఉంటావు వంకీలు తిరిగిన జుట్టు దువ్వగానే రింగులురింగులుగా తిరుగుతుంది. షర్టుకు గుండీలు లేకపోయినా - నీవు పెట్టుకోకపోయినా అదీ ఒక అందంగానే ఉంటుంది నీకు".

"వెక్కిరించకురా" అనేవాడు రావు.

"అలా అనుకోను. సహజమైన అందగాడికి దిద్దు బాటు ఎందుకురా. నావంటివాడికి కావాలి అదంతా"

నిజానికి ఎర్రగాబుర్రగా రావు ఉన్నప్పటికీ అందగాడనిపించడు. విట్టూ ఒక్కచూపుకోనే ఆకర్షింప బడతాడు. అతడి కళ్ళు కాంతిపుంజాలేమోననిపిస్తాయి, మాట సరేసరి-తేనెలు కురిపిస్తాయి.

"చిలిపిగా అనేవాడు-" పెళ్ళిచూపులకు నీవంతగా కష్టపడి అలంకరించుకోనవసరం లేదు. ఎప్పుడూ వేషంలో ఉన్నట్టే ఉంటావు"

పెళ్లిమాటరాగానే ఇద్దరికీ నవ్వొచ్చింది. ఎంత సేపో నవ్వినవ్వి కళ్ళుతుడుచుకున్నారు. ఇద్దరూ అలిసిపోయి పచ్చికమీదికి ఒరిగిపోయారు.

"మనకు పెళ్లేమిటిరా విట్టూ !" ఆనవ్వులోంచి తేరుకొని అన్నాడురావు.

"ఏం ? మనం మాత్రం మనుష్యులం కామా ?"

"అవునులే. వాళ్లను పోషించేటంత సంపాదన లేకుండానే ?"

తనూ విట్టూ ఒకగదిలో ఉన్నా ఒకరిని గురించి మరొకరికి బాగా తెలియదనే అనిపించింది రావుకు.

ఒకనాటి రాత్రి రావు హఠాత్తుగా నిద్రలోంచిలేచి కూర్చున్నాడు. కడుపులో నొప్పి-పోట్లు. భరించలేక చేతులతో నొక్కిపట్టుకుని కూర్చున్నాడు, తెరలు తెరలుగా నొప్పి వస్తోంది. కళ్ళుమూసుకుని మూలుగు తున్నాడు.

హాస్టల్లో స్టూడెంట్ల గదులముందరగా ఉన్న వరెండాకు రెండుపక్కలా కిందికి పోవటానికి మెట్లు ఉన్నాయి. క్రిందిభాగం కూడా సరిగ్గా ఇట్లాగే ఉంది. ముందరగా వున్న ఖాళీస్థలంలో పెద్ద పెద్దచెట్లు, వాటికి ఎర్రటిపూలు, పూచినచెట్లు చూడటానికి ఎంతబాగుంటాయో అంతచల్లగా ఉంటుందా ప్రదేశం

మూలుగుతున్న రావుకు ఆ నిశ్శబ్దనిశీథిలో ఎక్కడి నుండో రాగాలాపన వినిపిస్తోంది. అతడు వింటూ కడుపునొక్కుకుంటూ బాధపడుతున్నాడు. చూస్తే విట్టూ పక్క ఖాళిగాఉంది ఎక్కడికి వెళ్లిఉంటాడు? బాత్‌రూమ్ ?

రావు అలా కూర్చుని గంటకుపైగా అయింది. గడియారం చూసుకున్నాడు. రెండున్నర. విట్టూగనక వస్తే సిక్‌రూమునుంచి తనకేమయినా మందు తెస్తాడన్న ఆశతో మెల్లగా లేచాడు. గోడపట్టుకుని రెండడుగులు వేసి తలుపుగొళ్లెం తియ్యబోతే తలుపులుతెరిచే ఉన్నాయి.

రావు వరెండాలోకి వచ్చి అటూఇటూ చూశాడు అటుచివర పిట్టగోడమీద కూర్చున్నాడు విట్టూ

రావుకు గొంతెత్తి పిలిచే ఓపికలేదు. చప్పట్లు కొట్టాడు.

విట్టూ మెల్లిగా లేచివచ్చి పరిస్థితి అర్థంచేసుకుని ఒక మాత్ర తెచ్చిచ్చి మంచినీళ్లు చేతికిచ్చాడు.

మరునాడు——

"విట్టూ, రాత్రిఅక్కడ కూర్చునిఏంచేస్తున్నావురా? అడిగాడు రావు. అప్పటికి రావునొప్పి సర్దుకుంది. మామూలుగా లేచి ముఖంకడుక్కునికాఫీ తాగాడు.

"ఏం లేదు. నిద్రపట్టకపోతే అలా చల్లగాలికి కూర్చున్నాను."

మరి-కూనిరాగాలు తీస్తున్నావు ?

"ఆఁ——ఏదో కాలక్షేపం."

మళ్ళీ ఒక నెలయినా గడవకముందే ఇలాజరిగింది. రావుకు నిద్రపట్టక ఇంగ్లీషునవల 'కోమా' చేతపట్టాడు. ఇంతింత ఘోరాలు జరుగుతాయా హాస్పిటల్సులో ? గతిలేనివాడు వస్తే ఇదేగతా? మత్తుమందిచ్చి శరీరంలో ముఖ్యమైన భాగాలు తీసేసుకుంటారా ? ఎంత భయానకమయిన పరిస్థితి ? డాక్టర్లంతా ఒక్కటయితే రోగి పని అంతే. చటుక్కున పుస్తకం మూసిపక్కకు చూశాడు. విట్టూలేడు.

రావు నవలను పక్కకుపెట్టి తలుపు తెరిచి చూశాడు. పిట్టగోడమీద కూర్చుని, నీలాకాశంలో పరుగులు తీస్తున్న చంద్రుణ్ణి చూస్తూ కవితాగానం చేస్తున్నాడువిట్టూ. ఛందోబద్ధమయిన పద్యాలు ఒక ప్రత్యేకమయిన బాణీలో, అర్థవంతంగా,రాగయుక్తంగా గానం చేస్తున్నాడు. వింటున్న రావుకు దేహం పులకరించింది. రెండు తలుపుల మధ్యా నిలబడి, తన్మయుడై వింటున్నాడు,

విట్టూది ఇంతగొప్ప కవిత్వమా ?

ఇంత చక్కటి బాణీలో కవితాగానం చేయగలడా!

అంతవరకూ తనకు చెప్పలేదు విట్టూ-ఒకగదిలో ఉంటున్నా.

అంతవరకూ ఇద్దరూ రూమ్‌మేట్స్ వట్టిస్నేహితులు మాత్రమే. ఇప్పుడు ప్రాణస్నేహితులయ్యారు, ప్రతిరోజూ విటూచేత ఒక పద్యమయినా చదివించుకొని ఆఆనందంలో నిద్రలోకి జారుకునేవాడు రావు.

"ఏరా ! నీకు జోలపాటలు పాడడమేనా నాపని?"

"నీవునాపక్కన ఎన్నాళ్ళుంటావు కనుక ? అంతవరకూ పాడుతూఉండు."

"చూడు రావూ ! నీ కీ అలవాటయితే ముందు ముందు చాలాకష్టపడతావు !"

ఎప్పుడేది లభిస్తే దాన్ని అనుభవించటం ఏదీ లభించకపోతే ఊరుకోవటము అంతే"

"ఆ వచ్చే దొరసాని 'నీకీ అలవాటు ఎవరు చేశారని నన్ను తిట్టిపోస్తుంద'ని నా భయం"

"నేను నీ పేరుచెప్పనులే"

అప్పటినుంచీ విట్టూ ఖర్చులు చాలావరకు రావు మీదపడ్డాయి. అయినా రావు బాధపడలేదు. స్నేహితుడి సాంగత్యంవల్ల కలిగిన సంతోషమే తన భాగ్య మనుకున్నాడు

అలా 'లా' కాలెజిలో చదువు ముగించారిద్దరూ. ఉద్యోగాన్వేషణలో ఇద్దరికీ దారులు చీలిపోయాయి. అయినా ఏడాదికోసారి చూసుకుంటూనే ఉన్నారు కలుసుకున్న ఆ ఒకటి రెండురోజుల్లో మనసారా తనివి తీరేటట్టుగా కబుర్లు చెప్పుకునేవారు. విట్టూ స్వయంగా గానం చేసిన కవిత్వం విని పరవశించి పోయేవాడు రావు. ఇద్దరూ గృహస్థులయ్యారు. రావుకు ప్రభుత్వోద్యోగం దొరికింది. విట్టూకిబ్యాంకిలో ఉద్యోగం దొరికింది. ఫ్యామిలీప్లానింగ్ వారి ఆదర్శం ఇద్దరే పిల్లలు.

డబ్బుబాగా సంపాదిస్తూ, ఇల్లుకట్టుకొని, గవర్న మెంటుజీపులో తిరుగుతూ, ఠీవిగా అధికార పదవుల ననుభవిస్తున్న రావుకు ప్రతిరోజూ రాత్రివేళల్లో విట్టూ జ్ఞాపకం వచ్చేవాడు రానురాను ఇద్దరూ కలుసుకోవ టము తగ్గిపోయింది. కొంతకాలంపాటు ఉత్తరాలు ఇద్దరిమధ్యానడిచేవి. ఇప్పుడవీ లేవు.

విట్టూ ఉద్యోగం చేస్తున్నాడుకదా. ఆ కవితలన్నీ అచ్చువేయించుకోకూడదూ ? ఎవరి విలువలు వాళ్లకు తెలియవు. అయినా విట్టూ అన్నిటిలో శ్రద్ధవహించే వాడే మరి- ఈ విషయంలో అశ్రద్ధచేయటం ఆశ్చ ర్యంగా ఉంది.

రావు విట్టూను మందలిస్తూ ఉత్తరాలు రాసేవాడు. ఒకటి-రెండూ-మూడూ- ఎన్నిరాసినా జవాబురాదు. రావుకుప్రాణం కొట్టుకుపోతున్నది. తెలిసిన వాళ్లనూ కలిసిన వాళ్లనూ విట్టును గురించి అడుగుతూ ఉండే వాడు. ఇండియన్ బ్యాంక్ బ్రాంచెస్ కన్నిటికీ జాబులు వ్రాశాడు.

ఎక్కడి నుంచీ జవాబులు లేవు.

కొన్నాళ్ళు రోజూ జ్ఞాపకం వచ్చే విట్టు రావుకు జ్ఞాపకాల అడుగున పడిపోయాడు. కాని- సాయంత్ర మయే సరికల్లా ఎలాగో ఉండేదతడి మనస్సు. బాగా చదువుకుంటూ పైకి వస్తున్న పిల్లలు ఎదురుగా ఉన్న ప్రేమిస్తూ ప్రేమించబడే భార్య కంటికెదురుగా మసలుతున్నా— సాయంత్రమయే సరికల్లా ఏదో బెంగ.

ఒకనాడు వారపత్రికను ఏదో ఆలోచిస్తూనే తిరగ వేస్తూ ఒకచోట ఆగిపోయాడు.

1988 ఎన్నికల తరువాత ఆంధ్రరాష్ట్రాన్ని గురించిన నాలుగు చంపకమాలలు ఆహా! ఏమిఊహ ! ఎంతటి రాజకీయావగాహన? ఎంత చక్కగా అంచనా వేశాడో?

ఎవరీ రచయిత?

రావు మొదటి నుంచీ చదివాడు. మళ్ళీమళ్ళీ చది వాడు. రచన చేసింది పాండు.

"అరివిట్టూ! ఎన్నాళ్ళకు దొరికావురా? నిన్ను పట్టే శాను. నీ కవిత్వం వల్లే, నీవు పట్టుబడ్డావు ఇన్నాళ్ళు ఎక్కడున్నావురా?'

రావు వెంటనే ఆ పత్రికాధిపతికి "మీ వార పత్రి కలో ప్రచురితమయిన 'పాండు' కవిత్వాన్ని చదివి నేను చాలా సంతోషించాను. 'పాండు' గారి అడ్రసు తెలియ పరచవలసింద"ంటూ ఓ ఉత్తరం రాశాడు.

నాలుగో నాటికల్లా ఎడ్రసు వచ్చింది.

రావు ముఖం ట్యూబులైటులా వెలిగింది. మనిషిలో చాలా ఉత్సాహం వచ్చింది. జీపు నిండా పెట్రోలు పోయించు కున్నాడు. క్యాంపు నెపమ్మీద బయలు దేరాడు.

ఏవేవో ఊహలు - ఎన్నెన్నో ఊహలు! తప్పి పోయిన కన్నబిడ్డ దొరికినంత సంతోషం! పట్టరాని ఆనందంతో మునకలు వేస్తున్నాడు.. విట్టుకిద్దరు మగ

పిల్లలు. పెరిగి పెద్దవాళ్ళయి ఉంటారు. ఏం చదువుతున్నారో? ఇప్పుడే తన పెద్ద కూతుర్ని కోడలిగా చేసుకోమని చెప్పి ఉంచాలి. అలా చేస్తే తమ స్నేహం బంధుత్వంగా మారి, మరింత గాఢంగా మారుతుంది.

జీపు అతి వేగంగా పరుగులు తీస్తున్నది మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది. ఒక హోటలు ముందు జీపు ఆపుకుని డ్రైవరూ రావూ భోజనం చేశారు. అక్కడ అడిగితే విట్టు ఉన్న ఊరు ఒక పదిమైళ్ళ దూరం ఉందని చెప్పారు. పైగా అది కుగ్రామ మని కూడా తెలిసింది.

'అది కుగ్రామమే అయితే బ్యాంకు ఉంటుందా?'

అతడికి సందేహం కలిగింది. మళ్ళీ ఎడ్రసు గల చీటీని చూసుకున్నాడు.

పాండు

కేరాఫ్ కిల్లీకొట్టు శివయ్య

అంగలూరు.

ఉలిక్కి పడ్డాడు రావు. ఎడ్రసు కాగితం సరిగా చూసి, చదివి జేబులో పెట్టుకున్నాడా? బ్యాంకి ఆఫీసరు వితలేమిటి? కేరాఫ్ కిల్లీకొట్టుశివయ్యేమిటి? తనకు వచ్చిన ఎడ్రసు కాగితమేనా ఇది? రాగానే జేబులో పెట్టుకున్నాడు కదా? చూడకపోతే ఇంత దూరం ఎట్లా వచ్చాడు?

ఊరిపేరు మాత్రమే చూసి ఆత్రంగా కాగితం జేబులో కుక్కుకున్నాడు. ప్రాణస్నేహితుడి ఆచూకీ దొరికిన సంతోషంలో అంతే జరిగింది.

జీపు ఒకచోట ఆగింది. కిల్లీకొట్టు శివయ్య ఎక్కడుంటాడని డ్రైవరు వెళ్ళి తెలుసుకుని వచ్చాడు.

ఆ ఊరు చాలా చిన్నది. మట్టిరోడ్డు. వర్షాకాల మయితే బురదబురదగా ఉంటుంది. రెండు సందులు తిరగ్గానే శివయ్య కిల్లీకొట్టు దొరికింది. ఆ ఊరికల్లా ఒకటే కిల్లీకొట్టులా ఉంది. జనమంతా ఉన్నారు.

డ్రైవరు చీటీ చూపించాడు శివయ్యకు.

శివయ్య దిగ్గున లేచి, ఆ చీటి పట్టుకుని జీపు దగ్గరికి వచ్చి చూశాడు. జీపులో కూర్చున్నాయన పెద్ద ఆఫీసరులా ఉన్నాడు. ఈయనను ఆయనకు చూపిస్తే ఏం ప్రమాదమోనని ఆలోచించాడు.

"ఈ అయ్యగారు నాకు తెలియదండి. అయినా ఆరితో మీకేం పనండి?" అడిగాడు.

"అయితే నీకు తెలుసునన్నమాట! ఆయనకు నేను ప్రాణ స్నేహితుడిని. అతికష్టమ్మీద ఎడ్రసు సంపాదించాను. తొందరగా చూపించు ఆయిన ఇల్లు"

శివయ్య చాలాసేపు తటపటాయించాడు చూపించటానికి.

రావు మరొకసారి అడిగాడు వేడుకుంటున్నట్టుగా.

'మీరు జీబు దిగి నాతోరండి-చూపిస్తాను. కాని నా పేరు ఆయనకు చెప్పకండి.'

సంబరంగా కారు దిగాడు రావు 'నేను చెప్పను లేండి' అంటూ అతడి వెనుక అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు. కిల్లీకొట్టు వెనకాల నాలుగడుగులు వెడల్పు గల సందులో నుంచి తీసుకువెళ్ళి ఒక పాక ముందర నిలబడి ఇదే, అని, వేలితో చూపించి వెనక్కిమళ్ళాడు శివయ్య.

పడక కుర్చీలో ఒకతడు కూర్చుని ఉన్నాడు. పక్కన స్టూలు మీద పత్రికలూ కాగితాలు పడి ఉన్నాయి. ఒక పక్కగా ఒక నులక మంచం, దాని మీద ఒక దుప్పటి దిండు ఉన్నాయి. చూరుకు కట్టిన తాటిమీద ఆరవేసిన బట్టలూ, ఒక మూలగా ఒక కుండా దానిమీద మూతా, గ్లాసూ ఉన్నాయి.

కూర్చున్న వ్యక్తి ఒక తువాల కప్పుకొని రెండు చేతులూ, లోపల పెట్టుకుని ఉన్నాడు.

లోపలికి అడుగు పెట్టిన రావు ఆ వ్యక్తినే కన్నార్పకుండా చూస్తున్నాడు.

కళ్ళూ కళ్ళు కలుసుకున్నాయి.

వెంటనే గుర్తుపట్టగల స్థితిలోనే ఉన్నారిద్దరూ.

ఒణుకుతున్న కంఠంతో "విట్టూ! ఏమిటిది?" అన్నాడు మొదటి పలకరింపుగా రావు. అంతలోనే కన్నీళ్ళు చెంపల గుండా జాలు వారాయి.

"ఎందుకొచ్చావిక్కడికి? ఈ అడ్రసు నీకెలా తెలిసింది?" విట్టు కంఠం కఠినంగా ఉంది.

"అట్లా అడుగుతా వేమిరా విట్టు? ఇన్నాళ్ళు నీ అడ్రసు తెలియక బాధపడ్డాను. ఇటీవలె అతి అతికష్టమ్మీద పత్రికల వాళ్ళ దగ్గర్నించి సంపాదించాను. ఎడ్రసు తెలిశాక ఒక్క నిమిషం ఆగ బుద్ధవలేదు. నా మీద నీకేం కోపం లేదు కదా! ప్రాణ స్నేహితుడవని చూద్దామని వచ్చానురా" కళ్ళు తుడుచుకున్నాడు.

'ఇంత కాలం నీవేమయి పోయావని బాధ పడ్డాను ఆ కవిత్వం పేపర్లో చదివే సరికి నీవేననుకున్నానురా. నీ సంగతి చెప్పు? నీకీ అవతారమేమిటి? నీ ఉద్యోగమేమయింది?" మంచమ్మీద కూర్చోబోయాడు రావు.

"వద్దు, దానిమీద కూర్చోకు" యించుమించుగా అరిచాడు విటూ.

నిర్ఘాంత బోయాడు రావు. మతిగాని చలించ లేదు కదా? మతి చలిస్తే ఆ కవిత్వమెలా రాస్తాడు?

"జ్ఞాపకం తెచ్చుకో నేను రావును. నీ స్నేహితుణ్ణి" అన్నాడు అతడినే చూస్తూ రావు.

"పేపర్లు తీసి మంచమ్మీద పడేసి ఆ స్టూలు లాక్కుని కూర్చో" అన్నాడు బొంగురు పోయిన కంఠంతో.

రావు ఒదిగి ఒదిగి స్టూలు మీద కూర్చుని, విటు ముఖం లోకి చూశాడు. నెరిసిన క్రాపు-చెదిరిన తల వెంట్రుకలు చిందర వందరగా ఉన్నాయి. గడ్డం పెరిగింది. గుండీలు లేని చొక్కా వేసుకున్నాడు. దానిపైన ఒక తువాల కప్పుకున్నాడు. అదీ చాలా మాసిపోయింది. కాళ్ళకు మాత్రం లేసులక్కర లేని బూటు ఉన్నాయి.

రావు కళ్ళల్లో అర్థింపు స్పష్టంగా కనబడుతోంది.

"ఏం లేదురా. ఇంకా ఏడెనిమిదేళ్ళ సర్వీసు ఉంది. కాని నేను ఉద్యోగం వదిలిపెట్టి నాలుగేళ్ళయింది" తల వంచు కున్నాడు విటు.

"ఎందుకని?" ఆదుర్దా ఆవేదన కలిపి కేక పెట్టినట్లయింది.

"ఏముంది? లోక సహజం. పిల్లలిద్దరికీ డొనేషన్లు కట్టి చదివించాను. ఆ డబ్బు కోసం ఓవర్ టైము కూడా చేశాను. పరీక్షలవగానే ఇద్దరూ డబ్బు సంపాదనకోసం గల్ఫు కంట్రోలుకు వెళ్ళిపోయారు. అప్పు చేసి ఒక ఇల్లు కట్టాను నా అశ్రద్ధమూలంగా ఆరోగ్యం చెడి ఈ జబ్బులోకి దిగింది. బ్యాంకు ఉద్యోగం పోయింది వచ్చిన డబ్బు ఇంటి అప్పు కింద సరి పోయింది. నా భార్య ఆ యిల్లు రాయించుకుని నన్ను వెళ్లగొట్టింది. మారుమూల ఎవరూ గుర్తుపట్టనిచోట- ఈ గ్రామంలో- ఏర్పరుచుకున్నాను ఈ ఆశ్రమాన్ని." విట్టూనవ్వాడు. కాని- ఆ నవ్వు ఆర్తనాదంలా ఉంది.

"ఇంత బ్రతుకూ బ్రతికి, ఈ శివయ్య ఆదరణలో ఉన్నావురా ?" రావుకు మతి పోయినట్లవుతోంది.

"ఈ శివయ్య నేను ఉద్యోగం చేసే కాలంలో అటెండరుగా రిటైరయ్యాడు. నేనే అతడిచేత కిల్లీ దుకాణం పెట్టించాను. సిగరెట్లేకాక చాటుగా వైన్ కూడా అమ్ముతాడు."

"మరి నీ పోషణ ?" కడుపులో ఉన్న ఆవేదనంతా ముఖంలో కనబడుతోంది రావుకు.

"నా పోషణా ?" ఒక వెడద నవ్వు నవ్వాడు విట్టూ. మన కాలేజిలో ఒకడు కవిత్వం రాసేవాడు జ్ఞాపకముందా ? వాడి సాంగత్యంలో కొంత కవిత్వం రాశాను, ఇప్పుడిక విరామమే కనుక దాన్నే సాగిస్తున్నాను."

"మరి-నీ ఆరోగ్యం నిన్ను కవిత్వం రాయనిస్తున్నదా ? మరి-నీవు బైటికి రావటంలేదనీ, నిన్ను చూసిన వాళ్లెవరూ లేరనీ తెలిసింది నిజమేనా ?''

"అవును నిజమే. నన్ను చూడాల్సిన పనేముంది ఎవరికయినా ? నా పక్షాన ఈ శివయ్య అన్ని పనులూ చేస్తాడు. మెట్రిక్ వరకూ చదువుకున్నాడు. ఉత్తర ప్రత్యుత్తరాలు నా పేర చేస్తాడు''

''నీ పోషణకు చాలినంత డబ్బు వస్తుందామరి ?'' రావుకు విచారంతో పాటు ఆశ్చర్యం కూడా కలుగుతోంది. వీటినన్నిటినీ నమ్మటమా నమ్మకపోవటమా?

''ఆ, కొన్ని పబ్లిషింగ్ కంపెనీలు అనువాదాలు చెయ్యమనీ, మరికొన్ని పుస్తకాలు వ్రాయమని కోరుతూ ఉంటాయి.

మా శివయ్య ముందుగా డబ్బు తీసుకునిగాని వ్రాత ప్రతి ఇవ్వడు''

రావు ముఖం తెల్ల కాగితంలా ఉంది.

"ఇక్కడే పోస్టాఫీసులో పాండు పేరున ఎకౌంటు పెట్టాను. నా బ్రతుకు ఇలా తెర వెనుక నడుస్తోంది.''

అప్పుడే చూశాడు రావు అతడి చేతి వేళ్ళను. అవి అలవాటు చొప్పున బైటికి వచ్చి భుజమ్మీద ఉన్న తువాలను సవరించి లోపలికి వెళ్లాయి.

ఆ వేళ్లకు కట్లు ఉన్నాయి.

ఒళ్ళు జలదరించింది రావుకు.

తానెరిగిన విట్టూ ఈ బూచి లాంటి విట్టూకి ఎంత భేదముంది ?

అప్పుడు ఎంత సొగసుగా అలంకరించుకుని ఎంత ఠీవిగా ఉండేవాడు ? ఆ ముఖ వర్చస్సు ఏమయింది?

అప్పుడు-అతడు రేపటి ఆశతో బ్రతుకుతున్నవాడు.

నేడు-నిన్నటి విషాదంలో కుములుతున్నాడు.

ఈ రచనలు ఆరితేరాయి. కసుగాయలు కావు. అరమగ్గిన పండ్లనుకున్నాడు తను విషాదంలో కళాభివృద్ధి జరుగుతుంది కాబోలనుకున్నాడు.

విట్టూ పేర అచ్చవుతున్న రచనల కేమిపేరు పెట్టాలి ?

"ఏమిటా ఆలోచన, రావూ ? ఈ ఆశ్రమంలో నేనేమీ తెప్పించి ఇవ్వలేను నీకు !

ఆ మాటలకు ఉలిక్కి పడ్డాడు రావు.

''ఒరే విట్టూ ! నీ చేతికి కళ అబ్బిందనిపించుకుంటున్నావుగాని-మెదడుకు ఆలోచనలబ్బలేదురా. ఈ జబ్బు వచ్చిందని సంఘాన్ని వెలివేస్తావుట్రా ? దేశంలో మంచి డాక్టర్లున్నారు. మంచి మంచి మందులు వచ్చాయి. నా వెంటరా, నీకు మంచి వైద్యము చేయిస్తాను. నీమీద నీకు శ్రద్ధ లేకపోవచ్చు. కాని-నీ మీద నాకు శ్రద్ధ ఉన్నది. నా ప్రాణాన్ని పణంగా పెట్టి అయినా నీకు నయం చేస్తాను. రా''

విట్టూ మౌనంగా కూర్చున్నాడు వింటూ.

"నీవు నా ప్రాణ మిత్రుడివిరా. నిన్నీ స్థితిలో చూడలేకుండా ఉన్నాను. రారా నాతో ? నా జీపులో తీసుకువెళ్తాను. ఈ జబ్బుకు మంచి కేంద్రాలున్నాయి. ఒక దానిలో నిన్ను చేర్పించి నయం చేయిస్తాను. నీ క్రిందటి జన్మకు అప్రతిష్ఠ రాకుండా పాండుపేరు మీదనే చలామణి అవుదుగాని, నా మాట వినరా విట్టూ!'' విట్టూ భుజమ్మీద చెయ్యి వెయ్యాలని లేచాడు అప్రయత్నంగా.

''ఒరే దూరంగా ఉండమని చెప్పలేదూ ?'' విట్టూ కంఠంలో కాఠిన్యం తొంగి చూసింది.

సంధ్య చీకట్లలుము కుంటున్నాయి.

"నీకు వేళయింది వెళ్ళిపో రావూ ?"

"నేను వెళ్లటానికి రాలేదురా నీకిష్టం లేకపోయినా నిన్ను బలవంతంగా జీపు ఎక్కించి తీసుకుపోతాను."

ఇంతుప గింజలంత భాష్పాలు నిలిచాయి. విట్టూకి రావు వంక అర్థింగా చూశాడు.

"ఓరే, స్నేహమే అన్నిటినీ గెలుస్తుందని నేననుకోలేదురా రావూ ?"

"ప్రేమకంటె స్నేహమే గొప్పదని ఈ సృష్టి నిరూపిస్తుందిరా" రావుకు సంతోషం కలిగినట్టు చిరునవ్వు నవ్వాడు.

ఆ రాత్రి శివయ్య ఇంట్లో భోజనం నిద్ర అయింది రావుకూ డ్రైవరుకూ.

తెల్లవారిన తరువాత కాఫ్యాదులు ముగించుకుని రావు వచ్చేసరికి విట్టూ పోస్టాఫీసులో దాచిన డబ్బు తెప్పించుకున్నాడు. క్షౌరం చేయించుకున్నాడు. సూట్ వేసుకుని చేతులకు గ్లవ్సు తొడుక్కున్నాడు. తల వెంట్రుకల నెరుపూ, కొద్దిగా మీదపడిన వయసూ తప్ప హాస్టల్లో పిట్టగోడమీద కూర్చుని కవితాగానం చేసిన విట్టు కనుపించాడు రావుకు.

తిన్నగా జీపు దాచేపల్లి హాస్పిటల్‌కు చేరుకుంది. దారిలో ఇద్దరూ విద్యార్థుల్లా కబుర్లు చెప్పుకున్నారు.

హాస్పిటల్లో చేరిన విట్టుకి అన్ని పరీక్షలూ అయ్యాయి. వ్యాధి ఏ స్థాయిలో ఉన్నదీ డాక్టర్లు తెలుసుకున్నారు. దానికి తగినట్టు చికిత్స మొదలయింది. ఇంటెన్సివ్ ట్రీట్‌మెంటు జరుగుతున్నది.

రావు అతడిని వదలిపెట్టలేక బాధపడుతూనే జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.

విట్టు దగ్గర్నుంచి ఆరేడు నెలలు ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. ప్రతి ఉత్తరంలోనూ అతడు నూరిపోసిన ధైర్యానికి కృతజ్ఞతలు చెబుతూనే ఉన్నాడు విట్టు, తన ఆరోగ్యమెంత మెరుగవుతున్నది సంతోషంతో తెలుపుతూనే ఉన్నాడు.

ఏడాది అయీకాకముందే మళ్ళీ ఉత్తర ప్రత్యుత్తరాలు ఆగిపోయాయి. రావు ఆదుర్దాతో హాస్పిటల్ అధికారులకూ డాక్టర్లకూ విట్టుని గురించి జాబులు వ్రాశాడు.

విట్టుకి వ్యాధి తగ్గింది గాని మరికొన్ని రోజులు మందులు తీసుకోవాలని రాసి యిచ్చి డిస్చార్జి చేసినట్టుగా ఉత్తరం వచ్చింది.

రావు కలవర పడ్డాడు తను ఇంతకష్టపడి, బతిమిలాడి, తీసుకువచ్చి, హాస్పిటల్లో చేర్పిస్తే నయం కాగానే స్నేహితుడికి ఒక కార్డు వ్రాయకూడదా ? ఎక్కడికి వెళ్ళినా తన దగ్గరికి వచ్చి కనబడనిదే వెళ్ళనని మాట యిచ్చినవాడు నిలువుకోకూడదూ ? ఏం మనిషి ? ఏం మనిషి ? అతడి స్వభావమేమీ మారలేదు.

రావుకు రిటైరయ్యేకాలం దగ్గరికి వచ్చింది. కూతుళ్ళకు పెళ్ళిళ్లు చేశాడు. ఆ పెళ్ళిళ్ళకు విట్టు వచ్చి ఆశీర్వదించలేదని కించపడ్డాడు. తనను అభినందించలేదని బాధపడ్డాడు. కాని-విట్టు ఎక్కడున్నాడని ఈ కబురు తెలుస్తుంది ? మనసు సరిపెట్టుకున్నాడు.

రోజూ తలుచుకునేవాడు. ఆ మైత్రి అతడిని బాధిస్తునే ఉన్నది. కాలం మెల్లగా గడుస్తున్నది.

ప్రభుత్వ పక్షాన రావు ఢిల్లీ నగరం వెళ్ళాడు. కమిటీకి హాజరయిన తరువాత నగరంలోని ఆంధ్ర సంఘాలలోని పెద్దల నందరినీ కలుసుకున్నాడు ఇంకొక్కరు మిగిలారు. ఆయనకోసం రావు ఆటోలో బయలుదేరాడు సంఘం కార్యదర్శితో.

దారిలో అద్భుతమైన భవనాల జంట ఒకటి కనుపించింది. అత్యంతాధునికంగా కన్ను చెదిరేటట్టున్నది. ఢిల్లీ వంటి మహానగరంలో ఆ భవనాలను సామాన్యుడు కట్టగలడా ? నెలకు నాలుగయిదు వేల ఆదాయం గలవాడయినా కట్టలేడేమో ! స్థలం ధరే లక్షలు చేస్తుంది.

"ఈ యిల్లు కొత్తగా కట్టినట్టున్నారు. ఈ స్టయిల్లో కడితే చాలా డబ్బవుతుంది కదూ ?" అడిగాడు రావు.

"ఈ జంట భవనాలా అండీ ! రంగం అని ఒక ప్రభుత్వ కాంట్రాక్టరు కట్టాడండి అతడికి ఇదొక్కటే

వ్యాపారం కాదండి ఎన్నో సైడ్ బిజినెస్‌లు ఉన్నా యండి, మనిషి చాలా తెలివైనవాడు. చాకు లాంటి మనిషి, పి. డబుల్‌యు. డి. అంతా అతడి చేతిలోనే ఉంది. అటువంటివాళ్ళు కట్టకపోతే నెల జీతగాళ్ళు కడ తారా ?'' అన్నాడాయన.

రావు స్నేహితుడి యింట్లో మళ్లీ ఆ భవనాల ప్రసంగం వచ్చింది.

'అతడా ఆరంగమేనా ? చేతులకు గ్లవుసూ సూటు వేసుకుని ఓరుగుతూ ఉంటాడు ? ప్రభుత్వ మంతా తన చేతిలో ఉన్నట్టు మాట్లాడే ఆయన కదూ ? కాని ఒకటుంది ఆయన దగ్గర మేము దేనికో విరాళమివ్వ మనగానే వెంటనే ఐదువేలిచ్చాడు. ఆత్మీయంగా మాట్లాడతాడు. మహానుభావుడు. ఇంతా అయితేఆయన ఇక్కడికి వచ్చి ఆరేడేళ్ళయిందేమో ? ఇంతలోనే ఢిల్లీ నగరమంతా ఆయన పేరు మోగిపోతోంది.'' ఈ మాటలు ఇద్దరు ముగ్గురినోట విన్నాడు రావు.

అతడిని గురించిన ఆకారాది వివరాలడిగి తెలుసు కున్న తరువాత రావు అయోమయంలో నుంచి బయటపడ్డాడు. ఒరే ! పాండురంగవిఠల్ ! పేరును మూడు ముక్కలుచేసి—మూడు నాటకాలాడావు గదరా. ఆ కవితాగానమంతా హాస్టల్ వాచ్‌మెన్ కూకురికోసమా ? ఆ ఆశ్రమవాసి కావటం ప్రభుత్వం డబ్బు స్వంతానికి ఉపయోగించుకున్నందుకా కవిగా పేరుతెచ్చుకొన్నది అమాయకుడైన సహాధ్యాయి కవిత్వంతోనా ?

అమాయకుడు తన కవిత్వమంతా అచ్చువేసుకో లేక ఒక పుస్తకంలో చేతిరాతతో రాసుకున్నాడు. ఆది కనబడలేదని పిచ్చివాడిలా అందరినీ అడిగి లేదనిపించుకుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు. ఆ సంవత్స రమే అతడు కాలేజీనుంచి వెళ్ళిపోయాడు. అదంతా అదంతా ఇక్కడ ఉపయోగించుకున్నావా ? ఎవరిని మోసంచేసి ఈజంటభవనాలు కట్టావురా ?

ఇన్ని ఋజువులు దొరికినా రావుకు విట్టుమీద ఉన్న విశ్వాసం చెడలేదు. నమ్మలేకపోతున్నాడు. తన మనసు ఆంక్షలు పెడుతోంది. తనప్రాణ స్నేహి డయిన విట్టుమీద 'ఇటువంటి అపవాదులా ?' అంటోంది మనసు. అతడు స్వచ్ఛమైన స్ఫటికం లాంటివాడని నొక్కినొక్కి చెబుతోంది.

హృదయ భారంతో లేచాడు రావు.

'సుదర్శన'
2-2-14181/2, న్యూ నల్లకుంట
హైదరాబాదు-44

## కూచిమంచి తిమ్మకవి

# రాజశేఖర విలాసము

ఎమ్. బాగయ్య (ఎం.ఏ.)

దీనినే "భల్లాణ చరిత్ర"యని కూడ యందురు. ఇందలి కథాంశము ప్రాచీన శివభక్తులు మూఢ విశ్వాసముల యొక్కయు, స్త్రీల పాతివ్రత్యమును గ్రహించిన దేవతలు కరుణించి ప్రసాదించినవే మనకోరికలు.

ఈ శివభక్తులు భల్లాణరాజు గురు మతావలంబితుడు. తానొకవ్రతంబూని ఇష్టదాన వ్రతం సంకల్పించి సమస్తదేశముల జంగముల రావించి, వారి కభీష్టములైనటువంటి కోరికలు నెరవేర్చెదనని ప్రతిజ్ఞ (శపథము) చేసెను. ఇట్టివార్త తెలిసిన సమస్తదేశ ద్రిమ్మరులు, యోగులు, సాధువులు, సన్యాసులు సింధుకటకాధీశ్వరుడగు భల్లాణరాజు నాశ్రయించిరి.

అట్టి శివభక్తులు నొసట విభూతిరేఖలు, మెడలో రుద్రాక్షమాలలు, చేతిలో జపమాలలు, కొమ్ము చెంబులు, పిండిగంటలు, శంఖములూదుకొనుచు లేడి చర్మములు ధరించి, దర్భాసనములు తగిలించుకొని, ఆరుపింజల మడత నారవల్కములగు ధోవతులు గట్టుకొని లెక్కలేని జంగాలు నింగికెగసిరాగ, భల్లాణరాజు వారి యభీష్టములను నెరవేర్చుచుండెను.

అంతనిట్టి వార్త విన్న నారదుడు మనంబున సంతసించి శంకరున కెరుక పరచెను. అంత నా శివుడు కైలాసము నుండి తరలి జంగమ వేషధారియై యువరాజు నాశ్రయించెను. భల్లాణరాజు ఈ కపట వేషధారియైన శివుని యత్యంతాదరాభిమానముతో చూచి సత్కారములు చేసెను. కాని ఈ జంగము నేదిని గ్రహింపక (కోరక) తనకు పడుపుతనమే గల వేశ్యనిమ్మని కోరెను. రాజు జంగములుకోరిన కోరికలను కాదనువాడు గాడు. కనుక ఆ రోజు వేశ్య వాటికలను గాలించెను. కాని జంటలేని వేశ్యలాతని కంట బడరయ్యెను.

అపుడు రాజు ఖిన్నుడై తన మాట నిలబెట్టు కొనుటకై యత్నించిన ఫలితము దక్కలేదు. చివరకు మాటనిలబెట్టుకొనుటకై తన భార్యను బ్రతిమాలి యామెను వేశ్యవలె ధారణలుచేయించి, యాతని (శివుని) వద్దకు కొనిపోయెను.

ఇట్టి విషయము గ్రహించిన టక్కరి జంగమ రూపుధారి శివుడు యాభక్తుని (భల్లాణరాజు) సత్య వాక్పాలనకు, భక్తి పరత్వమునకు, సాహసమునకు సంతసిల్లి తన నిజరూపమును చూపించెను. అట్టి రాజశేఖరుని, వాని ఇరువురు భార్యలను సశరీరములతో కూడ కైలాసమునకు చేర్చుకొని, ప్రమథగణ రూపము గావించెను.

ఇట్టి కథను మన కవి తిమ్మన ప్రబంధ పక్కిన నడిపించిన కావ్య స్వరూపము చూడవచ్చును.

### కవిత్వపు సొంపు :-

ఈతని కవిత్వము గంగా ప్రవాహమువలె అనర్గళ ప్రసారముగను, ద్రాక్షాపాక ప్రచురముగను, మిక్కిలి రసవత్తరమై, పాకభూయిష్ఠమై యలరారుచున్నది.

సమకాలీనులైన ఏనుగు లక్ష్మణకవి వీరిని గూర్చి చెప్పిన మాట.

('రాజశేఖర విలాసము' పీఠికలో గలదు ఈ పద్యము.)

కం॥ హాటక గర్భవధూటీ
లాటన చలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్.

అని సభ యందు పొగడి నట్లున్నది ఈతని యక్షరాభ్యాస కాలములో ఈతని తల్లి ఇతని కభ్యంజనము సేయుచు నెత్తిన చమురు రాచి యంతలో కార్యాంతరమున పోయి ఆ పని చూచుకొని వచ్చునంతలో 'కుక్కుటేశ్వరస్వామి' ఈ బాలుని ముందు నిలిచి యనుగ్రహింప దలచి వచ్చి వృద్ధ బ్రాహ్మణ రూపము దాల్చి వచ్చి ఇరువది గనుపుల చెఱుకుగడ నొకదానిని యిచ్చి యదృశ్యమయ్యెను. అతడా చెఱుకుగడను తినుచుండగ చూచిన తన తమ్ముడు జగ్గన ఈతని చెంత నాడుకొనుచున్న వానికి చెఱుకుగడ విరుచుకొని పది గణుపుల గడ యిచ్చెనట ఇట్లగుటంచేత యిరువురకు సమానముగ కవితాధార యబ్బినటు ఇతిహ్యము గలదు. (ఇది గ్రంథ రచనలో గలదు)

ఇది కల్పితమైనను కాకున్నను ఈతని కవిత హృద్యముగా నున్నది. ఈతడెంతటి ప్రబంధము వేని యతి వేగముగా పూరించెడి వాడట. ఈతని చివరి కావ్యమైన శివలీలావిలాసమును (31) ముప్పదియొక్క దినములలో పూర్తి గావించినటున్నది.

## కవిజంగాలను గూర్చి జెప్పిన పద్యము

సీ॥ మల్లయ్య, వీరయ్య మఱి విరూపాక్షయ్య,
జడముడి బసవయ్య శంకరయ్య
పిడిఘంట చిక్కయ్య భీమయ్య సోమయ్య,
శివయ్య హరిణాంక శేఖరయ్య
మరులయ్య సంగయ్య మార్కొండ లింగయ్య
పర్వతనాథయ్య పశుపతయ్య
శరభయ్య రుద్రయ్య కరపాత్ర సిద్ధయ్య,
శతకంఠ యోగయ్య శ్రీగిరయ్య
విశ్వనాథయ్య వీరమాహేశ్వరయ్య,
యాదిగాఁ బేరుగల్గి మహాత్ములయిన
జంగమస్వాములా రాజసముఖమునకు,
సరగఁ జనుదెంచి రత్యంత సంభ్రమమున
(1-169)

అని కవి తన శివతత్త్వసారాంశమును గురువగు లింగనారాధ్యుసి ఆరాధ్యదైవమగు శివుని, శైవుల యొక్క నామంబులను తెలియజేసి శివారాధకుడైనాడు ఇందలి పేర్లు ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ మండల మందలి పాలమూరు (మహబూబునగర్), రంగారెడ్డి, మెదక్, నల్గొండ జిల్లాలలోను మరియు కర్ణాట దేశ మందును విరివిగా వాడబడు పేర్లు అధికములు. కొంత వరకు కర్నూలు, కడప జిల్లాల లోను శ్రీశైలప్రాంత మందును, కరీంనగర్, వేములవాడల లోను కూడా ఇట్టి నామంబులు వినుచుందుము.

త్రిలింగదేశ మనబడు మన ఆంధ్రదేశమున లింగ ధారణచే ప్రాంతమునకు (ద్రాక్షరామ, భీమేశ్వర, శ్రీశైలాదులను బట్టి) శైవుల నామంబులు గ్రహింప వచ్చును. జంగమ స్వాములను ఆదరించె భల్లాణరాజు చివరకు తన భార్యనైన పంపేటందుకు సిద్ధపడెను. కావున యిట్టి దైవ పరత్వులు, ప్రాణాలనైన విడిచే భక్తి తత్పరులు గల వారుండిరి.

కపట వేషధారియైన పరమ శివునకు భల్లాణరాజు వేశ్యను చేర్చుటకు యత్నించుటయు, నట గీతాలాపంబులు వినుచున్న వేశ్యలు ఒక్కరు కూడ ఒంటరిగ లేమిచే భిన్నుడైన రాజు గ్రహించిన తీరును, తిమ్మకవి తెలుగుపారి ఆడపడుచుల సొమ్ములెన్ని (ఆభరణములు) రకము లుండునో వాటిని, మనకు ఈక్రింది పద్యము వలన తెలుపుచున్నాడు.

సీ॥ బన్నసరంబులు, పచ్చల కడియంబు,
లాణి ముత్తెంపేరు లందియలును
గమ్మలు, బవిరెలు, గంటల మొంసూళ్ళు,
రంగైన భుజకీర్తులుంగరములు,
మొగపులతీగెలు బొదగలు బావతీ,
తిన్నంంపు ముంగలు, లేన్నవళములు,
చెవుల పువ్వులు, మంచి చేర్చుక్క బొట్టులు,
సొగసొప్పు బంగారు మొగలి జేకు.

(2-105)

యని కవి అచ్చుతెలుగు భాషయందలి తెలుగువారి సొమ్ముల పేర్లను విడివిడిగా వాడినాడు. నానా రకముల మణులు గ్రుచ్చిన దండలుగల, పచ్చలు తావిన చేతి మరియు కాళ్ళ యొక్క కడియంబులును, శ్రేష్ఠమైన మంచి ముత్తెముల హారములు, అందెలుగాను, చెవి కమ్మలు, చెవులపోగులు, గజగణ మ్రోగెడి యొలల యందలి సూళు త్రాడులకు బిగించిన గజ్జెలు గలవియు, రంగురంగుల స్కంధ భారములు, మెరుగైన ఉంగరములును, మొగిలి రేకులవంటి బొగడలు (అనగా వీటిని తెలంగాణమున బుగిడీలు యని అందురు ఇవి చెవిను. యొక్క పై భాగమున నడుమ బంగారమున ముత్యములు గ్రుచ్చిన గుత్తి ఉండు) బావతీ అనగా ఇవియు బావసీలు అందురు. ఇవి చెవి పై భాగమున ధరించెడి కర్ణాభరణం నీల వర్ణముగల ముంగురులు గల, చెవిపువ్వులు ఇవి రకరకాలుగా (పద్మముల వలెను, హంస, నెమలి. అశ్వము, గజము, పుష్పములవలె చేయించుకొనెడివారు) ధరించెడివియు, మంచి గంధముతో పెట్టబడిన అర్ధ చంద్రాకారపు చుక్క బొట్టులు ధరించినవారును, సొగసైన బంగారు మొగలి జేకులు ధరించిన వేశ్యలు ఆ రోజు రాజునకు కన్పించిరి. కావున కవి దీని వలన నాటి ప్రజల ధారణాదులను గ్రహించినవాడై సులభ శైలితో సామాన్య జనానీక వస్తువాహనాదుల నామ మాత్రములను కూడ విడనాడక పూసగ్రుచ్చినట్లు మనకు చూపించినాడు.

అట్టి వారదుని వలన భల్లాణ చరిత్ర విన్న శివుడు పరీక్షింప వచ్చి, రాజు వద్ద కోరిన కోరికలతో తగని కామ కోరికను వెల్లడించి, నాటిరేయి ఏ మగవానితో లేని వేశ్యనైన తోడితెమ్మని చెప్పిపంపి, ఆపై రాజు కోరిక మేరకు శివుడు చెప్పిన మాట ఇది.

కం॥ భోగింతు నెల్లవేళల, బాగొప్పెడు
కామశాస్త్ర పద్ధతి వెలయున్,
శ్రీ గల్గుట కరయగ ఫల, మీగతి
సుఖియింప వలదె యింపలరారన్?

యని కవి శివుని మనోరథమును చూపి, నాటి కామ ప్రవృత్తి యందలి కళను, నాటి సాంఘికాచార వ్యవహారములను, లోకమునకు చాటి చూపినాడు.

పరమ శివుడు భక్తుడగు భల్లాణ రాజుతో ఇట్లనెను.

"ఓ రాజా! చేతగాదేని మాట (శపథము) విడువుము. నీబింకము, రాజవృత్తి, వ్రతము, విడువుము. నాకు వస్తువాహన, రథ గజ, పదాతి పలంబులను మేడలును, ముత్యాలహారాలలును; కేవల రత్నాభరణంబులను, చాల సాహసముతో చేకూర్చితివి. కాని "యిప్పుడుద్వాహము సేయుకంటెనొక వారవధూటి నొసంగ రాదొకో ?"యని చెప్పినాడు. ఇంకొక మాట నీకు ఒకవేళ కాసులేక యుండవచ్చును. ఇదిగో నాచేతి కాసులైన యిచ్చి వేగముగా పోయి వెం (వెలగలది) పొలంతిని. దెప్పింపుము లేదా నీశపథమును చాలింపుమని శివుడనెను.

తెచ్చెదని రాజు పోవుటకు ప్రయత్నించగా - అట్టి యెడ నొక మాటను చెప్పిన శివుడు

గీ॥ విటునితోఁ గూడియున్నట్టి వెలఁది గాక,
కాని సెయు రోగియునుగాక పాపియునుగాక,
బేలయునుగాక తగ మగనాలుగాక,
యున్న వాల్గంటిఁ దెప్పింపు మర్వినాథ !

యని వేడిన తీరును మహాఘోరముగానున్నది. భక్తుని భావమును గ్రహించిన శివుడు మహాకోపముతో

పైమాటలు పెచ్చుగాలాడినను, భక్తుడు నమ్రభావముతో గ్రహించుటయు కవిచేసిన చమత్కారము. భక్తి, నీతి, గ్రహింపవచ్చును.

ఇంకను "ఓరాజా! స్త్రీలలో నాల్గు జాతులున్నవి. విని శ్రద్ధగా పద్మినిజాతిని తెమ్మని కోరిన

కం॥ వినుచిత్తినిశంఖిని, హస్తిని పద్మిని
యనెడు నాల్గుతెఱంగుల సతులం
దునఁ బేరెన్నికయగు పద్మిని
గావలెఁ జుమ్ముమాకు మిహిరకులేశా!

యని నాల్గుజాతులస్త్రీలలో ఉత్తమమైన పద్మిని నేకోరుట యిది లోక సహజము అయినది.

అట్లే వేశ్యలయొక్క గుణగణములను కవితూలనాడెను. మిక్కిలి కురూపియైన వానినైనను కందర్పుదందురు. నీచ జాతి వానినైనను ఉత్తమునిగ గ్రహింతురు మిక్కిలి మూఢుడైనను మంచి మానవునిగా తీసుకొందురు. సరసుడందురు. బ్రహ్మహంతకుడైనను ధార్మికుడందురు నీతిహీనుని సద్వర్తనుదందురు. తనకు వీసమైన చేత దొరికిన చాలనివత్తురు అని కవి వారకంతలను చాటెను.

మఱియు భోగము స్త్రీ తన కూతురు సంపాదించని రోజు తనతల్లి వగచిన తీరును కవి యిట్లు చూపినాడు.

సీ॥ మిండఁ డొక నాట రేయి రాకుండెనేనిఁ
వీసంబు చేతికిం గల్గనందు
కించుకేనియు నిదురఁ బోనీయదు కూఁతు
గడన పూబోఁడి యవ్వ పెన్కంచు మువ్వ
(3-75)

అని యావేశ్యమాత గుణమును చూపినాడు. ఒక నాటి రాత్రి పొరపాటున విటుడు రాక సంపాదన లేక యున్న స్త్రీ నాటి సమాజ వేశ్య మాతలెట్టి వగపును వొలకరించిరో పై మాటల వలన తెలియుచున్నది. విటుడు రాక, కాసులు లేక, ఆ రాత్రి నిద్దురరాక, తాను తనబిడ్డను నిద్దురపోనియ్యదు, ఆ యవ్వ(అమ్మ) పెద్దసానుల యవ్వమాట లిట్లుండునని కవి చూపెను.

ఇంతలో నడిరేయి అయినది. రాజు రాలేదు. వధూటిని పంపలేదు. కల్లరి జంగము క్రోధచిత్తుడై యుండునేమో? వ్రతము మీరినదేమో? విడువవచ్చునో భువిలో నపకీర్తి వచ్చునో? నాపై శివుని యనుగ్రహమెట్లున్నదో కదా? అని వాపోయెను వేశ్య నొసగెదనని నన్ను విశ్వసించిన జంగమునకు పలికినబొంకును ఆడితప్పుట మహిలో నసత్యము లాడుటయు, కల్మషముగాదా! మానవులకు చేటు (కీరప) గాదాయని విచారించెను. చక్రవర్తులను హరిశ్చంద్రాదులు నిత్య సత్యవ్రతాచారములు గల్గియేగదా! చిరకీర్తిని సంపాదించిరి. కావున నాకెట్టి చెడు కీర్తియో? అపకీర్తియో ఏది రానున్నదోగదా! యని మనస్సులో బాధచెందెను. ఇట్టి వ్రతాచారులకు నిత్యపారాయణమువంటి తీయని తేనె లొలుకు తేటల మాటలు చెప్పిన కవి తిమ్మన ఘనసీయుడు.

ఎల్లభంగుల వెదకిన రాజునకు వేశ్యకాంతనుగానని వాడై ఇంటికివచ్చి తన భార్యతో

ఉ॥ ఓ సరసీరుహాక్షి వినుమోకులపావని
యోవధూమణీ!
నీ సరియేరిమానినులు నేటొనరింపగ ముజ్జగంబుల
న్వాసిగ నేఁడు నాపలుకువాక్యము మీఱంగ వేశ్యకాంతవై
భాసిలి జంగమేశ్వరుని భావజకేళిఁ గఱంన జేయుమా
(3-108)

అని తన వ్రతమును కాపాడుమని రాజు తన భార్యతో వేళ్కొనెను. అంగీకరించిన భార్య జంగము దారి పట్టెను.

అప్పుడుజనులుపురములు, వాహనంబులు, భూషణములు, ధనధాన్యములు, అంబరములు, పాడిధేనువులు, కోరక జంగమయ్యా ఏ తీరున వేశ్య గోరె! సతి ధీరతతోనతడింటి యింతి గోరినన్ కోరెను. ఆమె యెట్లు పోయెనని వారకాంతలు అడుకొనిరి. (ఇది జనాపవాదము)·

జంగమ వేషధారియైన శివునకు వేశ్యారూపమున బయలుదేరిన రాజసతిని, శివుడు గ్రహించి ఆమె తన చేతులు చాచగా శివుడు బాలుడయ్యెను. అప్పుడు గొడ్రాలు ఏమిటి? ఈమెకు కొడుకేమిటి యింతలో వింత గల్గెనని రాజు అడిగెను, అంత స్వయాన శివుడే యిట్టి రూపము ధరించి మనల పరీక్షింప దలచి యిట్లు చేసెననియు, మనమిక ధన్యుల మనియు వారు గ్రహించిరి,

ఇట్టి కథను శివపారమ్యమును గ్రహించిన తిమ్మన నాటి సమాజ మందలి సాంఘికాచారములు గ్రహించినట్లు తోచుచున్నది. అడిగిన దానిని లేదనక, తాదని కడుద్రోయక, అతిథి సత్కారములు చేయుట నాటి ఆచారమై యుండినది. అది పరమ పవిత్రతకు పరమ శివునకు ముడివేసిన కావ్యరచనకు సాక్షీగా సాగించిన కవి తిమ్మన మూడాశ్వాసముల కావ్యమును ప్రబంధ ఫక్కీన సాగించినాడు.

తెలుగు పండితులు,
జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల
శంకరపల్లి

# అమరజీవి

— నారాయణం శేషుబాబు

ఆధునికాంధ్ర కవిత్వానికి ఆచార్యుడై
అడ్డదారులు త్రొక్కే తెలుగు పలుకుబడులకు అభినవ నన్నయయై
'అడుగులు బొబ్బలెత్త' అంటూ హృద్యమైన పద్యరచన కాద్యుడై
ఆంధ్రోద్యమానికి ఆదర్శంచూపిన ప్రజాప్రబోధకుడై
అమలినప్రేమను చాటి, శృంగార సాహిత్యప్రీతికి ఉత్తమసంస్కర్తయై
ఇంపుగ, సొంపుగ పరిసరాలను వర్ణించి, ప్రకృతికే బాష్యప్రణీతయై
హృదంతరాళాల్లోంచి పొంగి పొర్లే భావకవితకు పితామహుడై
ప్రవక్తయై, నవయుగ వైతాళికుడై
వర్ధిల్లిన రాయప్రోలు అమరజ్యోతి.

GOVERNMENT OF ANDHRA PRADESH

ABSTRACT

Secondary Education - Language Pandits Grade II in High Schools and Upper Primary Schools - Sanction of Grade I Scale of Pay - Orders - Issued.

EDUCATION (H1) DEPARTMENT

G. O. Ms. No. 330. Dated the 10th. August, 1983.

READ - the following:-

1) Govt. Memo. No. 646/H1/ 82-1, dt. 11-3-1982 of Education Department.

ORDER :-

In the Memorandum cited, Government had in Principle accepted the proposal to allow Grade I Language Pandits in scale of pay to Language Pandits Grade II also, Provided they possess the requisits qualifications of Grade I posts.

2) This issue was discussed by the Cabinet Sub-Committee constituted by the Government with the representatives of the Federation of Andhra Pradesh Teacher's Organisation, at the meetings held on 14-7-1983 and 15-7-1983. In the light of the agreement reached at these meetings, the following orders are issued in the matter

3) All Language Pandits working in the High Schools and Upper Primary Schools belonging to Government, Local Bodies (Municipalities, Zilla Parishads and Pamchayat Samithis) and Private managements possessing the qualifications required to hold the post of Grade I Language Pandit but working in Grade II Language Pandit posts shall be allowed the scale of Pay of Grade I Pandit i. e. Rs. 700-1200. These orders also apply to Language Pandits working in Abhyudaya Pradamika Vidya Samstha, Oriental and Tribal Schools. This is applicable to those pandits working in Grade II posts prior to 11-8-1982. These orders shall be implemented keeping in view the following instructions.

a) The posts of Grade II Language Pandits in High Schools held by Pandits possessing Grade I qualifications shall be upgraded as Grade - poses in the scale of Rs. 700-1200 from the date of this order and the persons working in those posts shall be treated as Grade - Pandits and their pay fixed under F. R 22 (a)(11)Subject to the condition that the number of Grade I posts be sanctioned as per the existing rules to the High Schools. Persons now working as Grade II Pandits in High Schools Should be adjusted against eligible Grade I Pandit posts as per the existing rules and allowed the Grade I scale and for suchother persons who cannot be adjusted against Grade I Pandits Posts be allowed the Grade I Scale as personal scale, and such persons be promoted as envisages in "c" below.

b) Grade II Language pandits working in Upper Primary Schools and and possessing Grade I Language Pandits qualification shall be given Grade I Language Pandit scale (Rs. 700-1200) as personal to them and their pay shall be fixed under F. R. 22 (a) (ii). This benefit shall not however be extened to Grade II Pandits appointed from 12-3-1982 eventhough they possess Grade I Language Pandits quelifications.

c) The posts of Language Pandits Grade I arising in High Schools in future shall not be filled by promotion of Grade II Pandits in High Schools or by direct recruitment till the Grade II Pandits possessing Grade I Pandits qualifications and enjoying the Scale of Grade I Pandits as personal to them in High Schools and Upper Primary Schools are abserbed in these Grade I vacancies.

d) The Grade II Language Pandits who are given Grade I Language Pandits scale as personal scale in Upper Primary Schools (Vide (b) above) shall be abserbed in the vacancies of Grade I Language Pandits posts arising in High Schools from 11-3-1982.

4) It has been decided that separate qualification shall be prescribed for Grade II and Grade I Language Pandits posts the qualification prescribed for Grade II Posts. The Commissioner of School Education is requested to submit necessary proposals in this regard immediate.

5) This order issues with the concurrence of Finance and planning Department vide their U. O. No. 2006/ JFS (M) / 83, dated 9-8-1983.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNER OF ANDHRA PRADESH)

K. V. R. MURTHY,
Secretary to Government.

To

The Commissioner for School Education, A. P. Hyderabad.
Copy to the Accountant General, A. P. Hyderabad.
Copy to the Pay and Accounts Officer, A. P. Hyderabad.
Copy to the Secretary General, Federation of Andhra Pradesh Teacher's Organisation, A. P. Hyderabad.
Copy to the Finance and Plainning (P. R. C. I.) Department.
Copy to the Directer of Information and Public relation, A.P. Hyderabab.
Copy to all Services Secretaries in Educational Department.
Copy to panchayat Raj Department/All D. E. S. in the State.
Copy to H. M. A. & J. D. Department./All D. E. O. S. in the State.
Copy to SF/Scs./Copy to all municipal Councils in the State.
copies : 50/copy to P. R. O. in Education Department, (4 copies)

forwarded by order

Sd/-
(SECTION OFFICER)

(TRUE COPY)

(T. V. S. SASTRY)
ACTING SECRETARY
Dakshina Bharat Hindi Prachara Sabha
Andhra : Hyderabad-500 004.

# సాహిత్యగోష్ఠి

## సాహిత్యరత్న శ్రీ కనుకుంట్ల చక్రపాణిగారి "ప్రళయఘోష"

### కవితా సంపుటి

నేడు సాహిత్యంలో పుంఖాను పుంఖాలుగా వెలువడుతున్న రచనల్లో సామాజిక స్పృహ కలిగిన అతికొద్ది రచనల్లో శ్రీ కనుకుంట్ల చక్రపాణి గారి 'ప్రళయఘోష' ఒకటి. ప్రజా చైతన్యానికి సాహిత్యం కూడా ఒక 'మీడియా'. అయితే ఆమీడియా ద్వారా బీటలు వారిన యీ అస్తవ్యస్థ సమాజంలో ఏదో సాధించాలనే తపనతో, ఉత్సాహంతో ఉరకలు వేసిన కవి హృదయంలోంచి పెల్లుబికిన 'లావా' ప్రతిరూపమో యీ కవితా సంపుటి. అయితే కొన్ని కవితల్లో ఆవేశమే కాని అవగాహన లోపించినట్లు కనిపిస్తాయి ... కవితలో కవి జనంలోకి చొచ్చుక పోతాడు. పరిష్కారం చూపెడుతాడు. తాను ముందుగా నడుస్తాడు.

పుస్తకం తెరవగానే కనిపించే మొదటి కవితలో

"అన్నపూర్ణ ఇంటిలోన
అన్నమే కరువైన నాడు
కడుపు గాలి కష్టజీవి
కరువుతోన మునిగితేలి
దిక్కులేక గంజికాయ
తేల్చ్య ముఖం వేసినాడు
ఆతనికి కావలసింది
ప్రజాతంత్రమా?

స్వాతంత్ర్యమా ?" (ఇది మనదేశం) అనడం కవి అణగారి పోతున్న అమాయకుల ప్రతినిధిలా అడుగుతాడు. మళ్ళీ అంతలోనే మరో కవితలో

'కారని కలాల సిరాతో
వ్రాయని వ్రాతలు వ్రాస్తూ
ఏదో తెస్తానంటూ
ఆలోచిస్తాడెందుకో ?'

అనే మినీకవితలో ఆత్మ విమర్శచేసుకుంటాడు. తోటి కవుల పరామర్శిస్తాడు.

"దీనజనోద్ధరణకు
దీక్షబూనాలి
సమతా రాజ్యానికి
'స్వాగతం పలకాలి" (సం।గామం)

అంటూ పరిష్కార వేదికను చూపెడుతాడు. అంతే కాదు భీభత్సంతో కూడా జేబులు నింపుకునే పెద్దల చేతులకు బేడీలు వెస్తాడు. 'అదిగో మనవాళ్ళు' అనే కవితలో ...

"బిర్లా టాటాలకు
భిక్ష మేసితి
గంజినీళ్ళకై
తపించుచుంటి

'అంటూ కూలీ జనంతో కవి తన గళం కలుపుతాడు. "నా కొద్దు"లో.

కర్మ సిద్ధాంత విషవలయంలో గిరిగీసు కూచున్న పెద్దలతో తన 'హేతువాదంలో'.

"ఏడాదికో మారు ఎందరమో చస్తుంటె
అల్లరాడే ఒక్కమారు కాపాడగ
దిగిరాడే దేవుడు దీనులకా పాడ
ఏసు ।పభువెటుబోయె, ఎందుకు రాడాయె ?"

అని ప్రశ్నించే శక్తి ఈ రచయితలో వున్న ఖరీదైన లక్షణం. నూతన సమాజాన్ని ఆశించి తాను కోరె మరో ప్రపంచం కోసం

"నూతన పల్లవిత
చిరు చిగుర్లు కావాలి

మోడు వారిన మహా వృక్షాల
పండిన పర్ణాలు కావు"

అనే కవి దోరణి శ్రీశ్రీ ... కవిత్వపు లక్షణంగా భాసిస్తుంది...వచన కవిత్వపు గుండె లోతుల్లోనివసిస్తుంది...

కుళ్ళిపోయిన యీ సమాజంలోకి గాంధీ గార్ని రావద్దని వేడుకుంటాడు. వచ్చారో ఈసారి

"ఈ గోడు చూడలేక
గోళీ లేకుండానే
గుటుక్కు మంటారు".

అని సవినయంగా మానవతా దృక్పథంలో 'విన్నపము' చేసుకుంటాడు. రోజు రోజుకు పెరుగుతున్న మాలిన్యాన్ని, జన జీవిత సంక్షోభాన్ని ... ఈ అసవ్యస్థ దురవస్తను చూడలేక ఈ వ్యవస్థను దురుస్తు చేయడానికి ఓ కొత్త డాక్టరుగా మన ముందుకు వస్తాడు.

"వాడ వాడ, ఊరూరు
పట్టణాలు తిరుగుతాను
పాతబడిన వ్యాధులకు
పదును మందు ఇస్తాను ....
దాగియున్న రోగాన్ని
పరిశీలన చేస్తాను ........
... ... ... అంటూ

మందో యవ్వ మందు "నేనొక క్రొత్త డాక్టర్ని" అని ఊరూ వాడా తిరుగుతు ... ఫీజులెకుండానే బాగు చేస్తానని...రోగులను పిలుస్తున్నాడు ...

'ఇది మన దేశమట
పవిత్రమైన దేశమట
.... ... .... ...
ధర్మదేశమిదేనట
పరీక్షించి చూడవోయి"

మనదేశాన్ని పరీక్షించి చూడమంటాడు. జరుగుతున్న హింస, అరాజకత కనపడుతుందని తట్టి లేపుతాడు.

"అర్ధరాతిరి నిద్దుర లేచి
వద్దన్నా వినిపించు కోవు
సద్దుమణిగిన సమయములోన
ఏమి చేస్తావు ఓ కవి నీవేమి చేస్తావు"
అంటూనే "స్తంభించిన సమాజంలోన
చైతన్యాన్ని కలిగించావు"

అనే జవాబుగా ఇస్తూ అందుకనేమో కవీ ... నీదో పిచ్చి ... అనే వ్యంగ దోరణి ... అభినందనీయం కాదా!

"ధనిక వర్గయుద్ధానికి
పేద వర్గముభికిరచో
ప్రళయ ఘోష తప్పదిక"

అని హెచ్చరిస్తాడు. సమిష్టి జీవన సౌఖ్యం కోసం కృషి చేస్తాడు.

"క్రాంతి రైతు"లో క్రాంతికి రైతుకు మధ్య సంభాషణలు కూర్చి ... కవితగా అల్లి ... చక్కటి ఆలోచనా వేదికను ... మన ముందుంచాడు ...

"గతాన్ని మరిపించే గమ్యానికి" నడవమంటాడు.

'ఆచార్య దేవోభవ' అని కీర్తించబడ్డ గురు దేవుడు ఈరోజు ఎంత హేయమైన స్థితిలో వున్నడో చూపెడుతూ ... గౌరవప్రదమైన ఆ వృత్తిని కించపరచ వద్దని దేశ సేవ యజ్ఞంలో వారంతా సమిధలని ... తెలుపుతూ 'గురు పూజ' చేసుకుంటాడు ... గురువు చక్రపాణి

తన తల్లిని, చెల్లిని సైతం....కామ పిశాచి కనుపొరలు కమ్మినపుడు మత్తుగాచూసె నిర్లజ్జా హీనులకు కనులు తెరిపించె. ఓరి భారతీయుడా ... కర్మహీనుడా ... దుష్కర్మ పాతీణుడా" అనే 'ఆమె నీ చెల్లి' కవితావాహిని స్వేఛ్ఛావాహినిగా ప్రవహిస్తుంది....

'స్తబ్దత' నిండిన ... నభోమండలములో, నవగ్రహ కూటమిలో సైతం .... జాతిని మెల్కొలిపి నీతిని ....నిజ స్వేచ్ఛను ... 'సాధిస్తా'నని చాటుకొంటాడు. "చైతన్య" రవళి పలికిస్తాడు

ఇలా ... నిత్య జీవితంలో జరుగుతున్న ఎన్నో

మరెన్నో ... సమస్యల దృష్టి యందుంచుకొని ... పెద్దల నిజాన్ని -నైజాన్ని చాటి చెప్పడానికన్నట్లుగా ... అభ్యుదయ, దిగంబర విప్లవ కవితా దోరణిల మువ్వల తాకిడులతో ... యీ ''ప్రళయ ఘోష'' యాభై నాలుగు కవితల కూడలిగా పేర్చిన శ్రీ చక్రపాణి కృషి...ప్రశంసనీయం ... అనక తప్పదు...అణగారి పోతున్న అమాయకుల...ఆక్రందనల...వి-టూ... ఓ విధమైన ఉద్వేగంలో ... రాల్చిన రచయిత సిరాచుక్కలు...కొన్ని ముద్దగా... పడినప్పటికిన్ని ... ఓ మార్పుకోసం ... తాను కోరుకునే నూతన సమాజం వైపు సాగిన స్రవంతిలా ... కాంతి దిశలో పయనిస్తాయని చెప్పడం నిస్సందేహం ...

ప్రళయం పలికే భాషగా అద్దెపల్లి రాంమోహన్ రావు 'ప్రళయ ఘోష'ను] అభివర్ణిస్తే ... ప్రజాకవి కాళోజి... తన అభిప్రాయ మధురిమ పలికితె...ఆచార్య కేత వరవు రామకోటిశాస్త్రి ... ఆలోకనపు ఆలోచనా శీస్సులతో ... వెలుగు చూసిన యీ కవితా సంపుటి .... సమతా సాహితి ప్రచురణగా రూపుదిద్దుకొంది—

కృష్ణ చైతన్య
5-8-142
హన్మకొండ - 506 001




# తొలకరి మెరుపులు

**రచన : శ్రీ రాముడుగు వేంకటేశ్వర శర్మ**

మూల్యం : మూడురూపాయలు.
ప్రతులకు : రచయిత పేరు
ఓరియంటల్ సంస్కృత కళాశాల
సూర్యనారాయణపురం
భీమవరం–2.

కవి శబ్దవ్యుత్పత్తిని గురించీ, కావ్య స్వరూప నిర్వచనాన్నిగురించీ అనేకమంది పండితులు అనేక అభిమతాలను వెల్లడించారు. చూచిన దానిని పద్యంగా వర్ణించటంవల్ల కవి అన్న ప్రసిద్ధి కలుగుతుందని భట్టనాయకుడు. ప్రతిభాశాలి అయిన వారు నిపుణతతో వర్ణించినపుడు అతడు 'కవి' అవుతాడని భామహుడు. ఇలా ప్రాచీనకాలంనుంచి కవి కావ్యవ్యుత్పత్తిని గురించి అనేక నిర్వచనాలు ప్రసిద్ధిలో వున్నాయి. ఇక కావ్యనిర్వచనానికి వస్తే "కావ్యం రసాత్మకం కావ్య"మ్మని విశ్వనాథుడు, రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్యమ్మని పండితరాయలు, "విశ్వశ్రేయః కావ్యం" అని వాగనుశాసనుడు- ధ్వనిప్రధానమయినదే కావ్యమని ఆనందవర్ధనుడు. యిలా పలువురు పెద్దల అభిప్రాయాలు భిన్నభిన్నంగా వున్నాయి. ఇక పాశ్చాత్యపండితులు తమకుతోచినరీతిలో కావ్యనిర్వచనాన్ని యిచ్చుకున్నారు. కావ్యప్రయోజనం గురించి కూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నా—

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహార విదే శివేతరక్షతమే
పద్యః వర నివృత్త యే కాంతా
సమ్మిత కయోపదేశయుజే

అన్న కావ్య ప్రచార కర్త అభిప్రాయం- నాటికీ నేటికీ గూడా అనుకూలంగా వుందనుకోవచ్చును.

మహాకావ్య, ఖండకావ్యాలు సాహితీ సుక్షేత్రాన్ని కొన్ని వందల సంవత్సరాలు సస్యశ్యామలం చేశాయి. పోనుపోను జీవితంలో వేగం పెరిగి, పెరిగి, లౌకిక విషయాలతో పాటు సాంస్కృతిక రంగంలోనూ వేగం హెచ్చింది. అతి చిన్న వ్యవస్థలో అతి గొప్ప విషయాన్ని వెల్లడించ గలిగే సామర్థ్యానికి విలువ హెచ్చింది. వీనితో మినీ కవిత. అన్న కొత్తమొక్క నాటుకొని 'యింతై వటుడింతింతై' అన్నట్లు అది ఒక విద్యుత్‌లా వ్యాపించి అందరి దృష్టినీ ఆకర్షించింది ఫలితం నేటి యుగంలో మినీకవితదే రాజ్యమయింది. చిన్నికృష్ణుడు చిన్న నోటిలో బ్రహ్మాండమంతటినీ చూపించారో లేదోగాని యీ మినీ కవిత మాత్రం అతిపెద్ద విషయాన్ని తన చిట్టెడు కడుపులో దాచుకుని అతి అమాయకంగా కనబడుతుందన్న మాట వాస్తవం ఈ చిన్నదయిన చిన్నది'- అందించే విషయం అతి విశాలమయినది. అతి లోతయినది.

"తొలకరి మెరుపులు"- కర్త యీ మినీ కవితా రచనలో తన ప్రజ్ఞాపాటవాలను చిక్కగా చక్కగా

నిరూపించుకున్నారు ఆ 'మెరుపుల' జిలిబిలి వెలుగును కలకాలం గుర్తుండేలా పుస్తకరూపంలో రావటం ముదావహం.

ఉదాహరణకు కొన్ని.

మసి గుడ్డలో చుట్టినా
తరిగిపోదు మాణిక్యానికి స్ఫూర్తి!
మట్టి గుడిసెలోకి నెట్టినా
తరిగిపోదు మహాత్మునికి కీర్తి!
నిజమే గదా!
గుళ్లో దేవుడికయినా తల వంచని వాడు
ఒళ్ళో పసివాని నవ్వుల కొడిగిపోగ తప్పదు!
పసికట్టాడిది దేవుడు- అందుకే
బైఠాయించాడేమో- ఆ పసి (డి) కన్నీళ్లల్లో

ఎంత అందమైన వాస్తవం!
"తలుపులు తెరిస్తేనే
కిటికీలోంచి వస్తుందిగాలి!
తలుపులు తెరిస్తేనే
మనసులోంచి వస్తుంది సంస్కార మధూళి!
"ఎడద గుడిగా
మెదడు బడిగా
యెదిగినపుడే
నరుడి నడవడి
ప్రగతికి ఒరవడి
జగతి సందడి"—

వంటి కవితల్లో అటు అర్థ సౌందర్యం. యిటు శబ్ద సౌందర్యమూ కలగలిసి- మనసుకు కితకితలు పెడతాయి. అంతెందుకు! యీ తొలకరి మెరుపుల వెలుగులు మినీ కవితావీధిలో తళుక్కు మంటూనే వుంటాయనడంలో సందేహం లేదు. కేవలం 3 రూ॥ల తోనే యీ సౌదా మినీ కవితలను అందిస్తున్న శ్రీని వాస భారతీ వారు నిజంగా అభినందనీయులే!

శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని.

# కొల్లేటి కెరటం

రచయిత : శ్రీ చింతపల్లి వెంకటనారాయణ

మూల్యం : మూడు రూపాయలు
ప్రతులకు : కొల్లేటికోట, యువ జన సమాఖ్య కొల్లేటికోట. కైక లూరు తాలూకా కృష్ణాజిల్లా

భారతదేశంలో అనేక విహార యాత్రాస్థలా లున్నాయి అలాగే మన రాష్ట్రంలో చూడదగ్గ ప్రదే శాలలో 'కొల్లేటి సరస్సు' ముఖ్యంగా చెప్పుకోదగ్గది.

పుస్తకం పేరు చూడగానే కొల్లేటి సరస్సు గురించి అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలు, విశేషాల గురించి అనేక విషయాలు తెలుస్తాయేమోనన్న ఆత్రుత తలెత్తడం సహజం. పుస్తక పఠనం లోకి ప్రవేశించక ముందే దాని తాలూకు 'పీఠిక' చదివితే కొంత అవ గాహన యేర్పడుతుందన్న కిటుకు తెలిసిన పాఠకుడు యిందులోని పీఠిక చదివి మరింత వుత్సాహంతో ముందు పేజీల్లోకి వురకటమూ సహజమే. కాని-

ఆ వుత్సాహమంతా ఒక్కమారుగా చల్లారిపోతే ?

నాట్యంలో అడుగులు నేర్చుకుంటున్న విద్యార్థి సాహసించి అరంగేట్రం చేయబూనుకోవటం లోని తొందరపాటు పెద్దలకు ముద్దుగా అనిపించినా అది ఆచరణీయం కాదుగదా!

'కొల్లేటి కెరటమన్న యీ పుస్తకం పేరుకీ లోపల వున్న కవితలకూ సంబంధం ఏమిటి! అన్న ఆలోచన వస్తే యీ రచయిత కొల్లేటి కాపురస్థుడు గనుక యితడు వ్రాసిన యీ కవితా సంకలనం కొల్లేటి సరస్సులో లేచిన ఓ చిఱు కెరటం'గా భావించుకొని తృప్తి పడటం కంటే వేరే మార్గం అనిపించదు. కొల్లేటిమాత, కొల్లేటి ప్రజల బ్రతుకు వంటి మూడు నాల్గు శీర్షికలు మాత్రమే కొద్దిగా ఆ ప్రాంత విశే షాలను తెలుపుతున్నాయి.

కాని అక్కడక్కడ తొంగి చూచే సామాజిక వాసన కొంత వరకూ మెచ్చుకోదగినదే! జాతీయ సమైక్యత కోసం ఆరాటం, సంఘ దురాచారాలను మట్టుపెట్టాలన్న ఆవేశం, కష్టజీవుల కడగండ్లు తీరాలన్న ఆవేదన, వంటి భావాలు యీ పుస్తకంలో స్పష్టంగా కనిపిస్తాయి.

"ఈ ప్రజల కన్నీరు - యెపుడౌను పన్నీరు,
యెన్నడీ వదనాలు ప్రకటించు మురిపాలు"—
"మెప్పించలేరు అల్లుళ్ళను యిప్పించి వేసినాపట్నం
వంటి పదాలలో కవి హృదయాంతరంగం వెల్లడవుతుంది

ఏది ఏమయిన- యీ కొల్లేటి కెరటం మరిన్ని కొల్లేటి విశేషాలు తెలిపే కృషి చేసి వుంటే బంగారానికి తావి అబ్బేది.

# అనురాగమాలికలు

రచన : శ్రీ లంకా వెంకట సుబ్రహ్మణ్యం

వెల : ఐదురూపాయలు
ప్రతులకు : రచయితపేర
C/O విశ్వసాహితీ
6-3-195 న్యూ బోయిగూడా,
సికింద్రాబాద్

అక్కడా అక్కడా ప్రచురితమయిన ఆకాశవాణిలో ప్రసారమయిన రచయిత కవితా ఖండికలను అందంగా అచ్చొత్తించారు విశ్వసాహితి వారు.

యిటువంటి సంస్థల సహకారం వర్తమాన రచయితల కెంతయినా అవసరమే. ఆ విషయంగా విశ్వసాహితి వారి యీ ప్రయత్నం ముందు ముందు మరెంతో మంది చక్కటి రచయితలకు అండగా వుండగలదని ఆశిద్దాం.

ఇక రచన విషయానికి వస్తే యిందులో పొందుపరచిన ఖండికలు చాలా వరకు ఆకాశవాణి ద్వారా ప్రసారమయినవే వాటిలో 'ఓ మనిషీ'' 'అనురాగ మాలికలు' 'స్నేహం' 'మహామనీషి' వంటి శీర్షికల్లో రచయిత భావాలు స్పష్టంగా వెల్లడయి శీర్షికను సార్థకం చేస్తున్నాయి

ఈ పాదాలు ఎంత అందంగా ఉన్నాయో చూడండి.

కడుపు పండితే బ్రతుకు ఉగాది
కడుపు ఎండితే బ్రతుకు సమాధి

కాని కొన్ని భావాలు రెండు మూడు శీర్షికలలో దాదాపు ఒకే పద జాలంలో కనిపించి చర్విత చర్వణం లా అనిపిస్తాయి.

ఐనా అందులో జీవిత సత్యం అందాలీనుతూనే ఉంది :-

1. అసలీ బ్రతుకే యమగోలట.

2. "ఉ" అన్న గేయముతో ఆత్మీయత లేనిచోట అనురాగం అల్లుకోదట.

అక్కడా అక్కడా ప్రయోగ చాతుర్యాన్ని ప్రకటించ బూనుకోటం అంత్య ప్రాసల కోసం తంటాలు పడటం— యిటువంటి ప్రయత్నాల నుంచి కొంచెం దూరమవటం మంచిదేమో ననిపిస్తుంది.

రచనలో నిజమైన చేవవుంటే కలకాలం నిలుస్తుంది. రచన అది ఒక మధురానుభూతి. ఒక గంభీరమయిన బాధ్యత ఒక తపస్సు. దాన్ని పవిత్రంగా నిజాయితీతో చేస్తేనే దాని సార్థకత.

శ్రీ దివాకర్లవారి మాటలతో—శ్రీ లంకా వెంకట సుబ్రమణ్యంగారి కవితల్లో—భావక్లేశమెందును గానరాదు.— అందరూ ఏకీభవించ గలరు.

# శ్రీశివ శతకము

రచన- కుమారి సదాశివుని భారతాంబ

వెల : రెండు-రూపాయలు
వలసినవారు : సదాశివుని శ్యామలాంబ, అంపలాం పోలాకి పోస్టు
శ్రీకాకుళం జిల్లా. 532 492

అతి చిన్న వయసులో జీవితం లోని నిస్సారతను గమనించి, విరక్తి చెంది, భగవద్భక్తిలో మానసిక

కాంతిని గమనించి భక్తవ శంకరుని పాదారవింద సంలగ్న హృదయుని యీ రచయిత్రి తన హృదయా వేదనను యీ శివశతకంలో పొందు పరచింది. అంత లోనే యే క్రూర దృష్టి సోకిందో గాని యీ చిన్నారి పువ్వు రాల మట్టిలో కలిసిపోయిందట, కానీ జన్మ సార్థక మొందించుకుని 'శివ పాదరేణువు' గా అమ రత్వాన్ని పొందినదీ యీ రచయిత్రి.

ఈ శతకమంతటా సదాశివుని చల్లని కరుణా కటాక్ష వీక్షణాలకై తీవ్రమైన తపన కనిపించి హృద యాలను బరువెక్కిస్తుంది. ప్రతి పద్యంలోనూ జీవితం పట్ల తీవ్రమైన అనాసక్తి భగవత్యాన్ని ధ్యానికై ఆరాటం అక్కడక్కడ పలుమారు చదివించ గలిగే కవయిత్రి వయో సహజమయిన అమాయకత మనలను ముగ్ధుల్ని చేస్తాయి.

అగణిత స్తోత్ర జ్యోతులు
గృహంబున వెట్టితి నంధకారమై
నగపడుచుండె నాకిచట
నాలయమందు కనంగ రాదు యే
గగనము నందు డాసితివో,
కన్నులు కాయలు గాచపోయె యో
నగ శిఖరాగ్రవాస పవనాశన.
భూష! మహేశ! హేశివా!

వేద విద్యా పారంగతులయిన మహామహులకీ అంతు చిక్కని భగవంతుని వునికిని ఎంత చనువుగా అడుగుతోందో చూడండి!

అంతలోనే సృష్టి స్థితి లయకారుడయిన భగ వంతుని విశ్వరూపం గుర్తుకు వచ్చిందేమో,

ఆలయ మేల నీకు, జగమంత
విహారము చేయకున్న, నీ
లోలయ మెట్లు పొందు భువి,
లోక మీచింతనలో మునింగి నీ
లీల గ్రహింప లేక కదళీఫల
గుచ్ఛము నారి కేశముల్
పూల నొసంగ నే తనువు
పూజకు నిచ్చెద పొందుమా శివా?

తాను వ్రాసిన విధంగానే తన తనువును భగవ త్పూజకు అంకితం చేసిన యీ కవయిత్రి నిజంగా ధన్యజీవి.

— శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని

## శ్రీ కాట్రగడ్డ
# మనసైతే ఒకటేనోయ్

సాహిత్యం సృజించడంలో రెండు విధాలు. ఒకటి చిలువలు పలువలు అల్లి నర్మగర్భంగా అందించడం మరొకటి వ్యంగ్యంగాను, సున్నితంగా సటైరికల్‌గా చెప్పడం అనేది. ఈమధ్యలో కవిత్వం ఈ రెండింటిని ఆధారం చేసుకొని వస్తున్నప్పటికిని, సటైరికల్‌గా వ్యంగ్య పూరితముగా రావడం చాలా తక్కువ అయి నది. ఈ సెటైరికల్ ప్రక్రియను జోడించుకొని చెప్ప దలచుకున్న భావాలను, పరస్పర విరుద్ధమైన వాటిని ఒక దగ్గరకు చేర్చి, సున్నితంగా, హాస్యంగా మనకు అందించిన కవితల సంపుటిలో శ్రీ కాట్రగడ్డ గారు వెలువరించిన "మనసైతే ఒకటేనోయ్" కార్టూన్ కవితలు ఒకటి. ఇందులో 144 (పద్యాలను) పద బంధాలను తళుక్కులతో, బెళుక్కులతో, పదాలను ఏర్చి కూర్చి జోడించి వాటికి చివరి వాక్యం "మన సైతే ఒకటేనోయ్" అనే మకుటాన్ని చేర్చి అందించారు.

శ్రీ కాట్రగడ్డ గారు ఈ సంపుటిలో స్పృశించని తట్టని విషయం లేదు. ఇందులో ఎన్నో విషయాలను చక్కగా వంగ్యంగా పాఠకుడి హృదయాన్ని కదిలించి రవళింప చేసి అందించిన నాలుగు వాక్యాల సంశోభిత

మైన కవితల మాలికయే శ్రీ కాట్రగడ్డ గారి "మనసైతే ఒకటేనోయ్". ఇందులోని ప్రతి చరణంలోను ప్రాస చోటుచేసుకొని వినసొంపుగాను, చదువ సొంపుగాను ఉండి పాఠకుడిని చివరి వరకు పరుగెత్తిస్తుంది. అందుకే శ్రీ కాట్రగడ్డ గారు యతి ప్రాసను జోడు గుఱ్ఱాలుగా చేసుకొని ప్రయత్నిస్తున్న భావౌచిత్యుడు. ఈయన ప్రతి పదంలోను పాఠకుడికి ఉల్లాసం కలిగిస్తుంది అనడంలో అతిశయోక్తి లేదు.

ఈయన కవిత్వంలో చురకలూ, మెరుపులూ ఉన్నాయి. ఈ కార్టూన్ కవితలు పరిశీలనా దృక్పథం ప్రతి పదంలోను ఉన్నాయని స్పష్ట పరుస్తుంది. పరస్పర విరుద్ధమైన భావాలను ఒక చోట చేర్చి తనుగా చూసి "మనసైతే ఒకటేనోయ్" అని చెప్పడంలోనే వారి ప్రత్యేకత మనకు కనబడుతుంది

"బుఱ్ఱమీద పెరుగే బొచ్చు
కొండమీద కెగిరే ఖర్చు
బురదలాగా మారే రొచ్చు
మనసైతే ఒకటేనోయ్!"
"సిగరెట్టుకు చిలక్కొట్టుడు
చిలకమ్మకు బ్రాందీ పట్టుడు
ఫైళ్ళలో కరెన్సీ నెట్టుడు
మనసైతే ఒకటేనోయ్!"

పై పంక్తులను చూస్తే ఈయన కవితాధార, రచనా పాటవం మనకు బోధపడుతుంది. మన వాడుకల్లో ఒక సామెత ఉంది. "మనసైతే మల్లి, లేకపోతే ఎల్లి" అని, దాని ప్రకారం మనసును మనకు మనసైన విధముగా మలచుకోవచ్చును. అప్పుడు మనసైతే, ఇష్టమైతే అన్న ఒకటే గదా! శ్రీ కాట్రగడ్డ గారు ఆశు కవిత్వ వేగంతో రాయడముతో సరిపుచ్చుకోకుండా, కాస్త జాగరూకత వహిస్తే వారి నుండి మనం ఇంకెన్నో మంచి సంకలనాలు వస్తాయని ఆశించవచ్చును.

విభిన్న కోణాల్లో, ముప్పేటను వేసిన శ్రీ కాట్రగడ్డ గారు వెలువరించిన "మనసైతే ఒకటేనోయ్" కవితా ప్రియులకు అందించిన ఒక చక్కని మనసైన బహుమతి అనవచ్చును.

# ఈ దేశం

రచన : వాసాల నరసయ్య

(ప్రచురణ : వరప్రసాద్ పబ్లికేషన్సు
2-1-50/F మెట్టుపల్లి-505 325
పేజీలు 10 + 60 వెల 300)

ఈ సంపుటిలోని కవితలన్నింటిని పరిశీలిస్తే కవి గారి కవితాతత్వం బోధపడుతుంది. తమకు కలిగిన భావాలను సరళమైన భాషలో, ధారాళమైన శైలిలో చెప్పటం ముఖ్యంగా కనపడుతుంది. ఈ దేశంలో జరుగుతున్న అనేకమైన విషయాల్ని కవితా వస్తువులుగా స్వీకరించి, మంచికి హర్షించి-చెడుకు దుఃఖించి తమదైన ఒక సొంత పరిష్కార మార్గాన్ని ఇవ్వటం ఈ కవిగారి ప్రత్యేకతగా గోచరిస్తుంది.

ఈదేశం అనే దేహానికి-కులతత్వం, మతమౌఢ్యం అస్పృశ్యత, పక్షపాతం అనే అసంఖ్యాకమైన జబ్బులున్నాయనీ, ఇన్నిజబ్బులుంటే దేశం ఏమైపోతుందని ఆందోళనను వెలిబుచ్చుతూనే-

"మనుషులంతా
కలిసివుంటే....
సమస్యలే లేవంట !" అంటూ

చక్కటి పరిష్కారాన్ని సూచించారు.

"ఆ మబ్బులకు ఆస్థిరత్వం లేదు
ఈ పెద్దలకు వ్యక్తిత్వం లేదు !'

# వార్తావాహిని

## సభలు-సమావేశములు

23-6-1988న, పైడిపాటి సాహిత్యపీఠం వారు 1988వ సంవత్సరపు పైడిపాటి పారితోషికమును, డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారికి సమర్పిస్తూ, "విమర్శక సార్వభౌమ" బిరుదప్రదానం చేశారు. సభాప్రారంభం చేసిన డాక్టర్. జి ఎ సుబ్రహ్మణ్యం గారు అవధానిగారి వైదుష్యాన్ని కొనియాడారు. ఆకాశవాణి విజయవాడ డైరెక్టరు శ్రీ పి ఆర్. రెడ్డిగా రధ్యక్షత వహించారు. పీఠం కార్యదర్శి పైడిపాటి ఉమానాథశర్మ స్వాగతం చెప్పారు. మల్లాది సూరి బాబుబృందం 'త్రిలింగదేశం' గానం చేశారు.

అవధానిగారు శ్రీపైడిపాటి సుబ్బారామశాస్త్రి రచించిన శతపత్రము, మహారుద్రము, ఋతుప్రబంధము లోని రామణీయకతను స్మృసిస్తూ, మహాకవులననుసరించిన ధ్వనిమార్గంలో శతపత్రం రచింపబడినదన్నారు. శ్రీ మొక్కపాటి శర్మ వందన సమర్పణం చేశారు

దర్శకాచార్య శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారలకు, 1981, 1982వ సంవత్సరములలో పైడిపాటి పారితోషికం (రు116/-) సమర్పింపబడింది.

## హిందీ విజయపత్ర వితరణోత్సవము

ది. 20-7-84 సాయంకాలం ఐదున్నర గంటలకు హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి పక్షమున దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, ఖైరతాబాదు భవనంలో హిందీ విజయపత్ర వితరణోత్సవము జరిగినది. మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు అధ్యక్షత వహించిరి దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర కార్యనిర్వాహక కార్యదర్శి శ్రీ తంగిరాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అతిధులకు స్వాగతం పలికిరి.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్య సంయుక్త సంచాలకులు శ్రీ వి. కొండలరావుగారు విజేతలైన అభ్యర్థులకు హిందీ విజయపత్రములు, బహుమతులు ప్రదానము గావించిరి. జాతీయ భాష హిందీని ప్రతివాడు తప్పనిసరిగా నేర్చుకొనవలసినదిగా వారు ఉద్బోధించిరి ఈ సందర్భమున హిందీ విద్యాశాఖాధికారి డాక్టర్ బి. సాయిలు, ప్రొఫెసర్ బి. రామయ్య మైసూరు విశ్వవిద్యాలయం, గారలు ఉపన్యసించిరి.

మండలి కార్యదర్శి శ్రీ యం. ఆదినారాయణగారు వందనసమర్పణ గావించిరి.

## హిందీ ప్రేమీమండలి - హైదరాబాద్ రజతజయంతి ఉత్సవములు

తేది. 28-7-84 మరియు 29-7-84లలో రజత జయంత్యుత్సవములు జరుపుటకు వలయు ఏర్పాట్లు జరుపబడినవి. తేది 24-7-84 సాయంత్రం గం॥ 6-00 లకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్రకార్యాలయములో స్వాగతాధ్యక్షులు శ్రీటోకర్సీ లాల్ కపాడియా గారి అధ్యక్షతన స్వర్ణజయంతి కమిటీ సమావేశము జరిగినది ఈ సమావేశమునకు

పలువురు సభ్యులు హాజరైరి. హైదరాబాద్‌నగరములో అనూహ్యమైన పరిస్థితులు నెలకొనిన దృష్ట్యా ఈ రజత జయంత్యుత్సవములను తాత్కాలికముగ వాయిదా వేయుటకు సర్వులు ఏకగ్రీవముగా నిర్ణయించిరి. కర్ఫ్యూ అనంతరము మరల రజతజయింతి కమిటీ సమావేశమయి రజతోత్సవములు జరుపు తేదీలను నిర్ణయించగలరు. వివిధ పత్రికలలో ఆతేదీలు ప్రచురించగలదు.

చ। నరసింహమూర్తి

లు

హిందీ ప్రేమీమండలి

## శీర్ల బ్రహ్మయ్య శిలావిగ్రహ ప్రతిష్ఠాపక సన్నాహసభ—ఏలూరు

తేది 22-7-84 ఆదివారం ఉదయం పదిగంటలకు శ్రీ శీర్ల బ్రహ్మయ్య హిందీ మాహావిద్యాలయంలో శ్రీ శీర్ల బ్రహ్మయ్య శిలావిగ్రహ ప్రతిష్ఠాపన సన్నాహక సభజరిగినది. దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర ఉపాధ్యక్షులు శ్రీ కట్టా పూర్ణచంద్ర రావు అధ్యక్షత వహించారు. సభకు ఏలూరు పుర ప్రముఖులు, అభిమానులు పలువురు వచ్చినారు. శ్రీ శీర్ల బ్రహ్మయ్యగారి నీతి నిజాయితీలను నిష్కళంక రాజకీయజీవితమును, ప్రజాసేవానిరతిని చాలామంది శ్లాఘించినారు

శ్రీ పటకర్ల రామమోహనరావుగారు- సదస్య-దక్షిణ భారత హిందీప్రచార సభ, ఆంధ్ర హైద్రాబాద్-సంధానకర్తగాను వ్యాఖ్యాతగాను వ్యవహరించి అందరిహృదయాలను చూరగొన్నారు- వక్తలందరు విగ్రహ ప్రతిష్ఠకు ఇంకెలాంటి జాగుచెయ్యావలదన్నారు, శీర్లవారి విగ్రహం నవతరానికి ప్రేరణ యిచ్చి వారిని సమాజసేవా తత్పరులనుగా తీర్చిదిద్దగలదని పట్టణ ప్రముఖులు చెప్పినారు.

శ్రీబోయపాటి నాగేశ్వరరావు-దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు మరియు ఆంధ్ర సభ్యులు —శ్రీ తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి-కార్యవాహి సచివులు-దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్రహైద్రాబాద్, మరియు శ్రీకాట వేంకటేశ్వరరావు - దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర, సభ్యులు-సభకు విచ్చేసినారు- శ్రీ బ్రహ్మయ్య గారి తోటి హిందీ ప్రచార సంబంధాలు-బ్రహ్మయ్యగారు జైల్లోకూడా నాటి స్వాతంత్ర్య సంగ్రామ యోధులకు జాతీయభాషయైన హిందీ నేర్పుట మొదలైన అనుభవాలను గూర్చి ప్రసంగించి త్వరగా కార్యోన్ముఖులు కండని ఉద్బోధించారు.

ఈ విగ్రహ ప్రతిష్ఠాపక సన్నాహకమిటీకి వంకలేని శ్రీ రామచంద్రరావు గారిని హర్షధ్వానాల మధ్య అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. శ్రీ శీర్లవారి స్మృతి చిహ్నంగా పట్టణంలో ప్రజోపయోగ్యమయిన పలు కార్యక్రమాలు చేపట్టాలని పలువురు సూచించారు శీర్ల బ్రహ్మయ్యగారి రాజకీయ జీవితాన్ని వ్యక్తిత్వాన్ని స్పృశిస్తూ జరిగిన ప్రసంగాలతో సభాహృదయం ఆర్ద్రమై పోయినది. తన ఆర్ద్రహృదయమును వర్షధార బాహ్యప్రకృతికూడ కరిగిపోయినది.

శ్రీ రామభద్రరాజు గారు పెద్దలనుండి వచ్చిన సందేశాలను చదివి వినిపించారు. శ్రీ అల్లా సూర్యనారాయణగారి వందన సమర్పణతో సభ జయప్రదమైనది.

## ఆగస్టు 15

స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో- చిత్తూరు జిల్లా కలెక్టరు గారి సమక్షంలో జరిగిన బహిరంగ సభతో అధ్యక్షులు (దక్షిణ భారత హిందీప్రచారసభ) శ్రీ ఎం. వి. పాపన్న గుప్త గారిని సన్మానిస్తూ వారి శేవలను పొగుడుతూ "తామ్రపత్రం" సమర్పించి గౌరవించిరి.



పేరు : మునుకుట్ల లక్ష్మీనరసింహమూర్తి

అర్హతలు : రా భా. ప్రవీణ, ప్రచారక్

వృత్తి : హిందీ పండిట్.

కార్యక్షేత్రం : శ్రీలక్ష్మీ హిందీ విద్యాలయం, కాకినాడ-1

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి.

చిరునామా : శ్రీలక్ష్మీ హిందీ విద్యాలయం,
దంటువారి వీధి, కాకినాడ-533 001



పేరు : కాసమశెట్టి లక్ష్మీనారాయణ

వృత్తి : హిందీ పండిట్

అర్హతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, S.S.L.C., సా. రత్న.

కార్యక్షేత్రం : రాజంపేట

అభిరుచి : హిందీప్రచారం, పరిచయ్ పరీక్షయందు ప్రత్యేకకృషి

చిరునామా : ఆర్. యస్. రోడ్, రాజంపేట. 516 115, కడపజిల్లా.



పేరు : కూచి రామకృష్ణ శర్మ

వృత్తి : హిందీ పండితులు

యోగ్యతలు : రా. భా. ప్రవీణ, ప్రచారక్, S. S. L. C.

కార్యక్షేత్రం : వేములమడ

అభిరుచి : హిందీ ప్రచారం, పరిచయపరీక్ష నందు ప్రత్యేక కృషి.

ఇంటి చిరునామా : S/o వీర హనుమంత రావు, వేములమడ-పోస్టు,
మొవ్వ-521 135 కృష్ణాజిల్లా

విద్యాలయం చిరునామా | ప్రిన్సిపాల్, శ్రీ హనుమాన్ హిందీ విద్యాలయం,
మొవ్వ-521 135, కృష్ణాజిల్లా

20.7 84న జరిగిన హిందీ విజయపత్ర వితరణోత్సవ సందర్భముగ తీయబడిన ఛాయాచిత్రము.



ఇందు శ్రీ వి. కొండలరావుగారు, సంయుక్త సంచాలకులు, ఉన్నతవిద్య, ఆ.ప్ర: డాక్టరు బి. సాయిలుగారు ఉన్నత హిందీ విద్యాధికారి, శ్రీ చవాకుల నరసింహమూర్తి గారు అధ్యక్షులు హిందీ ప్రేమీ మండలి, శ్రీ టి.వి. సుబ్రమణ్యశాస్త్రి గారు కార్యవాహక కార్యదర్శి, ద.భా. హిందీప్రచార సభ, ఆంధ్ర, శ్రీ యమ్. ఆదినారాయణ, శ్రీ బి. రామయ్య గారు తదితరభృతులు గలరు.

**Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004. and Printed at Dakshina Bharat Press, Hyderabad-500004.**